## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలుపైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలుపైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100066495



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# రుద్రమ

మల్లాది సుబ్బమ్మ



ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి
హైదరాబాదు

# తొలి పలుకు

బాలలకు విద్యా, వైజ్ఞానిక, సాంస్కృతిక రంగాలలో క్రమ వికాసం కలిగించాలనే లక్ష్యంతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1976 లో ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమిని స్థాపించింది. నాటి రాష్ట్రపతి శ్రీ ఫకృద్దీన్ ఆలీ అహ్మద్ ప్రారంభం చేసిన బాలల అకాడమికి నాటి విద్యా సాంస్కృతిక వ్యవహారాల శాఖ మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు తొలి అధ్యక్షులుగా ఉన్నారు. బాలల అకాడమి తన లక్ష్య సాధన కోసం చేపట్టిన పథకాలలో బాల సాహిత్య ప్రచురణ పథకం కింద పిల్లలకు మంచి పుస్తకాలు ప్రచురించే కార్యక్రమం ఒకటి.

ఈ శతాబ్దంలో తెలుగు భాషలో ఆధునిక సాహిత్యం మూడు పువ్వులు ఆరు కాయలుగా విలసిల్లుతున్న తరుణంలో పిల్లల గురించి ఆలోచిస్తున్నవారు బహు అరుదు. ఆ లోటును పూరించటానికి, ఉత్తమ బాల సాహిత్యం అందించటానికి బాలల అకాడమి పూనుకొన్నది.

వివిధ వయో వర్గాల బాలల అవగాహన స్థాయికి తగినట్లు సరళమైన భాషలో, తేలిక పదాలతో కథలు, గేయాలు, గేయకథలు, బొమ్మల కథలు, జీవిత చరిత్రలు, నవలలు, వైజ్ఞానిక రచనలు ప్రచురించటం జరుగుతోంది. రాసిలో కాకుండా వాసిలో శ్రద్ధ వహించి, బాలల్లో విజ్ఞాన వినోద వికాసాలను పెంపొందించి, వారికి ఉత్తమ బాల సాహిత్యం అందించటమే ప్రధాన ధ్యేయంగా పెట్టుకొన్నది బాలల అకాడమి.

అమృత తుల్యమైన బాల సాహిత్యాన్ని, వివిధ కోణాలలో, వివిధ భావదీప్తులను వెలారించగల విభిన్న ప్రక్రియలలోగల బాలసాహిత్యాన్ని

ఒక్క మాటలో చెప్పాలంటే - బాలసాహిత్య సర్వస్వాన్ని ప్రచురించా లనే సదుద్దేశంతో వెలువరించిన పుస్తకాలలో ఇది ఒకటి.

ముందు ముందు కూడా బాలలకు ఆసక్తి కలిగించే సామాజిక వైజ్ఞానిక సాహసోపేత రచనలను కూడా తెలుగు బాలలకు అందించాలను కుంటున్నాము. బాలల సర్వతోముఖాభివృద్ధిని, వారి మానసిక వికాసాన్ని ఆకాంక్షించే ఉత్తమ అభిరుచిగల తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు-బాలల అకాడమి చేస్తూన్న ఈ కృషిని బాలలకు అందుబాటులోకి తీసుకురావ టానికి సర్వ విధాలా మాతో సహకరిస్తారని ఆశిస్తున్నాము.

**డా॥ వాసిరెడ్డి సీతాదేవి**
సంచాలకులు
ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి.

# రుద్రమ

ఆ రోజు రమకు పదవ పుట్టిన రోజు. తలంటు పోసుకుని కొత్త బట్టలు కట్టుకుంది. 'కేకు' చుట్టూ ఉన్న పది కాండిల్సు వెలిగించి కేకు కోసింది. "హేపీ బర్త్ డే టూ యూ" అంటూ అందరూ చప్పట్లు కొట్టారు. అందరి నోట్లో కేకు ముక్కలు పెట్టింది. రమ తమ్ముడు రవి కాస్త దుడుకువాడు. రెండు ముక్కలెత్తుకెళ్ళి తింటున్నాడు. రమ అమ్మకూ నాన్నకూ దణ్ణాలు పెట్టింది. "ఆయురారోగ్యాలతో చలగా మహారాణిలా వర్ధిల్లమని" దీవించింది మామ్మ.



"మామ్మా! రాజులు పాలించిన రాజ్యాలుంటాయి గాని రాజ్యాలు పాలించిన మహారాణులు ఉన్నారా? మన దేశాన్ని గాని, తెలుగు రాష్ట్రాన్ని గాని రాణులెప్పుడైనా పరిపాలించారా? నన్ను 'మహారాణిలా' అని దీవించావు కదా?" రమ మామ్మను ప్రశ్నించింది.

"చారిక ఏలిక అయితే మగాళ్ళు పడి ఉంటారా?" ధీమాగా ఎత్తి పొడిచాడు రవి.

"ఏం ఆడవాళ్ళు మనుష్యులు కారా? మేమూ మీలాగానే పుట్టాం. అన్ని పనులూ చేయగలం. చదువుకోగలం, ఉద్యోగాలు చెయ్యగలం, ఊళ్ళు ఏలగలం. రాజ్యాలు పరిపాలించగలం" అంటూ రవి వైపు చూస్తూ వెక్కిరించింది రమ.

"మీరు దెబ్బలాడుకోకండర్రా. నాకు తెలిసిన ఒక రాణి కథ చెప్తాను" ఇద్దరినీ సమాధాన పరిచింది మామ్మ.

రమ, రవి ఇద్దరూ మామ్మను కథ చెప్పమని ఆ రాత్రి వేధించడం మొదలెట్టారు. "అయితే మీరు మొదలు పెట్టండి, నేను పూర్తి చేస్తా" అన్నది మామ్మ.

"అనగా అనగా ఒక రాజు" అన్నాడు రవి.

"కాదు, కాదు అనగా అనగా ఒక రాణి" అన్నది రమ.

"వీల్లేదు, రాజు కథే కావాలి" పట్టుబట్టాడు రవి.

"వల్లకాదు, రాణి కథే చెప్పాలి" వాదించింది రమ.

"ఇది మహిళా దశాబ్దంరా! అందుకని రాణి కథే చెప్పాలిరా" తీర్పు పలికింది మామ్మ.

"ఏదో కథ చెప్పు"మని విసుక్కున్నాడు రవి గుటకలుమింగుతూ. తనే గెలిచానని గర్వంగా చూచింది రమ. ఇద్దర్నీ స్థిమిత పరిచి కథకు ఉపక్రమించింది మామ్మ.

మామ్మ ఆ వెనుకటి రోజుల్లో ఏడు క్లాసులు చదివింది.

ఎలిమెంటరీ స్కూలు టీచరుగా పనిచేసింది కొన్నేళ్ళు. స్కూలు పాఠాలతో పాటు పిల్లలకు మంచి క్రమశిక్షణ నేర్పించేది. చరిత్ర, నీతి

పాఠాలు చెప్పి వారిని ఆలోచింపచేసేది. స్త్రీల చరిత్రలంటే మామ్మకు మరీ ఇష్టం. అందుకే రాణి కథ చెపుతానంది.

"అయితే మామ్మా! రాణి అంటే రాజుగారి భార్యా?" అని అడిగాడు రవి.

"నే చెప్పేది అలాంటి రాణి కథకాదు రా. రాజ్యం చేసిన రాణి కథ రా".

"ఇంతకూ ఆ రాణి పేరేమిటి?" అడిగింది రమ.

"కాకతీయ సామ్రాజ్యాన్ని పాలించిన రాణి రుద్రమదేవి."

మామ్మా! నేను 'విక్టోరియా రాణి'ని గురించి చదివాను. అలాంటి మనిషేనా ఈ రాణి!"

"కాదురా పిచ్చి సన్నాసి. విక్టోరియా లాంటి వారు పేరుకు మాత్రం రాణులు. రుద్రమ దేవి మాత్రం నిజంగా తానై రాజ్యపాలన చేసింది."

"అంటే మన దేశంలో, ఇజ్రాయిలులో, శ్రీలంకలో స్త్రీలు ప్రధాన మంత్రులుగా ఉన్నారుగా, అలాగా మామ్మా?" ఉత్సాహంతో, సంతోషంతో అడిగింది రమ.

"కదమ్మా! నీవు చెప్పిన దేశాలలో రాజులు, రాణులు లేరు. దేశానికి అధ్యక్షుడు ఉంటాడు. కాని అధికారం పూర్తిగా ప్రధాన మంత్రికి ఉండదు."

"అయితే మామ్మా! మామూలు రాణులకన్నా, ప్రధాన మంత్రుల కన్నా రాణి రుద్రమదేవి గొప్పదా?" ప్రశ్నించాడు రవి.

"అవును బాబూ, ఆమె గోదావరి తీరం నుండి పెన్న వరకు, తూర్పున సముద్రం దేవగిరి వరకు ఉన్న గొప్ప సామ్రాజ్యాన్ని పాలించింది. ఎంతో పెద్ద ప్రాంతమది కనుకనే దానిని సామ్రాజ్యం అన్నారు." వివరించింది మామ్మ.

"మామ్మా! ఇంగ్లీషు వాళ్ళతో వీరనారి ఝాన్సీ లక్ష్మీబాయి పోరాడింది కదూ! ఆమె రాజ్యం కన్నా రుద్రమ దేవి రాజ్యం పెద్దదా?"

"అవును రమా! కాకతీయ సామ్రాజ్య ప్రాంతంలో పోలిస్తే ఝాన్సీ లక్ష్మీబాయి పాలించిన దేశం చాలా చిన్నది. రాణి రుద్రమదేవి రాజ్యం చాలా విశాల మయింది."

"మామ్మా! రుద్రమదేవి ఆడదికదా! ఆమెను ఎందుకు రాజ్యం చేయనిచ్చారు? ఈ మగాళ్ళంత చేతకానివారా? నేనైతే రమను నామీద పెత్తనం చేయనీయను." అన్నాడు రవి గర్వంగా రమ కళ్ళల్లోకి చూస్తూ.

"నేను నీకన్నా పెద్దదాన్ని" అంది రమ ధీమాగా.

వయస్సులో పెద్ద కావచ్చు. కాని నీవు ఆడదానివి. నేను మగాడిని. మగాళ్ళే పెత్తనం చేయాలి." దబాయించాడు రవి.

"ఓరీ! అప్పుడేనా మీ తగువు. ఆడవాళ్ళు రాజ్యాలను పాలిస్తూంటే, ఇప్పుడే పోట్లాడుతున్న మగాళ్ళు ఆనాడు ఊరుకుంటారురా? అప్పుడూ ఎదురు తిరిగారు." అంది మామ్మ.

"ఎదురు తిరగక ఏంచేస్తారు మగాళ్ళు?" ప్రశ్నించాడు రవి.

"ఏం? ఇన్నాళ్ళు పురుషులు అధికారం చలాయిస్తుంటే మేము ఊరుకోలా? ఇప్పుడు స్త్రీలు పరిపాలన చేస్తామంటే ఎందుకంత ఉక్రోషం?" నిలదీసి అడిగింది రమ.

"బాగా చెప్పావు తల్లీ! ఆ గర్వంతోనే సామంతులు ఆమెకు ఎదురు తిరిగారు." అన్నది మామ్మ.

"ఎదురు తిరిగితే ఊరుకుంటుందా? అంత గొప్ప రాణి! వాళ్ళను చావకొట్టి చెవులు మూయించి ఉంటుంది." సగర్వంగా పలికింది రమ.

''ఆడదానికి చేతనవ్వొద్దూ అంతమంది సామంత రాజులను లొంగదీయడం!'' ఎద్దేవాగా పలికాడు రవి.

"అది కష్టమే మరి. కాని ఆ ఘనకార్యాన్ని రాణి రుద్రమదేవి చేసి తన సత్తా నిరూపించుకున్నదిరా.'' వివరించింది మామ్మ.

"ఇంతకూ ఆమె ఎక్కడ రాజ్యం చేసిందో చెప్పలేదు మామ్మా!"

''అయ్యో! నా తెలివి మండిపోను. అది చెప్పటం మరచే పోయాను. వరంగల్ అనే నగరం పేరు విన్నారుకదర్రా. దానినే పూర్వం 'ఓరుగల్లు' అనేవారు. అది వారి రాజధాని." వివరించింది మామ్మ.

''మామ్మా! రాణి రుద్రమదేవి భాష ఏమిటి?'' తన కుతూహలాన్ని ప్రదర్శించింది రమ.

''ఆమె అచ్చం తెనుగు బిడ్డతల్లీ! మన తెలుగు దేశపు ఆడబడుచు ఆమె.''

మామ్మా ముఖంలో తేజస్సు, గర్వం తొణికిసలాడాయి. మంచి ఉత్సాహంతో చెబుతోంది.

'మా తెలుగు తల్లికి మల్లెపూదండ'' పాట లంకించుకొన్నాడు రవి.

''తెలుగువారి సామ్రాజ్యాలు మూడేరా, మొదటిది శాతవాహనులది. రెండవది కాకతీయులది. మూడవది విజయనగరసామ్రాజ్యం."

"వీరంతా ఏ నగరాలను రాజధానులుగా పెట్టుకొని పాలించారు?'' ప్రశ్నించాడు రవి.

''శాతవాహనులు ఇప్పటి అమరావతి దగ్గర ధరణికోట నుండి పాలించారు. విజయనగరం రాజులు బళ్ళారి వద్ద వున్న హంపీ నుండి పాలించారు. శాతవాహనులు ఉత్తరాన బీహారులో ఉన్న మగధను కూడ

ఆక్రమించారు. విజయనగర సామ్రాజ్యం దక్షిణాపథం అంతా విస్తరించి ఉండేది.''

"ఇంతకూ కాకతీయ సామ్రాజ్యం ఏకాలానిది?'' రవి తన సందేహాన్ని వెలిబుచ్చాడు.

"పదకొండవ శతాబ్దం నుండి పదునాల్గవశతాబ్దం వరకు సుమారు మూడువందల సంవత్సరాలకు పైగా కాకతీయ రాజ్యం నిలిచి ఉంది.''

"ప్రతాపరుద్రీయ నాటకం చూచాను మామ్మా! ఆ ప్రతాప రుద్రుడు రాణి రుద్రమదేవికి ఏమౌతాడు?'' రమ కళ్ళు తిప్పుతూ అడిగింది.

''ఆ ప్రతాపరుద్రుడు, రుద్రమదేవి కుమార్తె ముమ్మడమ్మ కుమారుడు.''

''ఒరేయ్! మీరు ప్రశ్నలడగకుండా ఉంటే నేను కథ మొదటి నుండీ చెప్తానర్రా.''

''మేము మాట్లాడంలే'' అంది రమ.

నోటిమీద వేలు పెట్టుకున్నాడు రవి. వారి ఆసక్తికి సంతోషిస్తూ మామ్మ కథ చెప్పటం మొదలు పెట్టింది:

"కాకతీయ సామ్రాజ్యాన్ని కట్టుదిట్టంగా పాలించిన వారిలో గణపతిదేవుడు ముఖ్యుడు. ఓరుగల్లులో 'కాకతి' అనే గ్రామదేవత ఉండేది. ఆ దేవత ఈ రాజవంశానికి ఇలవేల్పు. కనుక వారికి కాకతీయులని పేరు వచ్చింది. వారు మొదట్లో జైనమతాన్ని అభిమానించారు. తరువాత శైవమతాన్ని అవలంబించారు.

గణపతిదేవునికి పట్టపురాణి సోమాంబ వల్ల రుద్రాంబ, గణపాంబ అనే ఇద్దరు కుమార్తెలు కలిగారు. కుమారులు లేని లోటు తీర్చుకోవాలనుకున్నాడు గణపతిదేవుడు. అందుకని పెద్ద కుమార్తె రుద్రాంబకు

గుఱ్ఱపుస్వారి, ఈటె విసరటం, విలువిద్య, కత్తియుద్ధం, కఱ్ఱ తిప్పటం, ఇలాంటి యుద్ధ విద్యలన్నీ నేర్పించాడు. తనతోపాటు సభలకు తీసుకెళ్ళి రాజ్యపాలనా తంత్రం తెలియజెప్పేవాడు పేరు రుద్రమదేవిగా మార్పించాడు. తను ముద్దుగా ఆమెను 'రుద్రదేవుడు' అనే పిలిచేవాడు. మగ పేరు పెట్టాడని మీకు ఆశ్చర్యంగా ఉందికదూ! మామూలుగా మగవారు చేసే మంత్రాంగాలు, సైనిక శిక్షణ కుమార్తెకు ఇప్పించాడు, కనుక ఆ పేరు పెట్టడంలో ఎబ్బెరికం ఏమీ లేదు. పైగా కాకతీయులు రాచవారు. రాచవారిలో పురుషుల పేరు చివర ఉండే 'అయ్య' అనే మాట స్త్రీల పేర్ల చివరకూడా వస్తుంది. అందువల్లనే రుద్రమదేవి కుమార్తెను 'ముమ్మడమ్మ' అని పిలిచేవారు.

''మరి రుద్రమదేవి స్త్రీల దుస్తులతో సభలకు వెళ్ళేదా లేక పురుష వేషంతో సంచరించేదా అని మీకు అనుమానం కలుగుతున్నది కదూ? చెప్తావినండి.''

''మామ్మా నాకు తెలుసు, ఆమె లాగూలు తొడుక్కునేది అక్కలాగానే.'' అరిచాడు రవి.

''మాట్లాడ నంటివిగా?'' గద్దించింది రమ.

గప్ చిప్‌గా ఊరుకున్నాడు రవి.

''అవున్రా, నిజమే; రుద్రమదేవి పురుష వేషంతో తిరిగేది. ఎందుకో తెలుసా? గుఱ్ఱం ఎక్కి స్వారి చేయడానికి చీరెకట్టు ఇబ్బందిగా వుంటుంది. మరో కారణం కూడా ఉంది. ఆనాడు అంటే – తెలుసా? ఇప్పటికి ఏడువందల ఏండ్ల నాటి మాట – చాలా మంది మగాళ్ళకు ఆడ వాళ్ళంటే చులకన భావం ఉండేది. అందుకని ఆమె పురుషవేషంతో నిర్భయంగా సింహాసనం మీద కూర్చునేది. అలా చేయడంలో ఆమె ఏ మోసమూ చేయలేదు. కాగా, వీలుకోసం, వెసులుబాటు కోసం అలా చేసింది.

'కాబోయే రాణి' అని రుద్రమదేవి పేరు ప్రకటించాడు గణపతి దేవుడు. వాస్తవానికి ఆమే రాజ్యం చేసేది. ఆమెను 'పట్టధృతి' అని వర్ణించడం జరిగింది. అంటే ఈనాటి మాటల్లో 'యువరాణి' అన్నట్లు. పేరు తండ్రిది, పరిపాలన ఆమెది.



ఆనాడు స్త్రీలకు వివాహం విధిగా జరగాల్సి ఉంది. అలాగే రుద్రమదేవి వివాహం జరిగింది. తాడేపల్లిగూడెం, రాజమండ్రిల మధ్య నిడదవోలు అనే ఊరు ఉంది మీరు విన్నారుగా. ఆ నిడదవోలులో రాజ్యం చేస్తున్న చాళుక్యరాజు వీరభద్రేశ్వరునికి ఇచ్చి ఆమె తండ్రి గణపతిదేవుడు ఆమెకు వివాహం చేశాడు. ఆమెకు పురుష సంతానం కలుగలేదు. కనుకనే ఆమె తదనంతరం ఆమె పెంపుడు కూతురుకొడుకు ప్రతాపరుద్రుడు రాజ్యానికి వచ్చాడు.

గణపతి దేవుడు చాలా శక్తి సంపన్నుడు. అతడు రాజ్యం చేసి నన్నాళ్ళూ సామంతులు అణగి మణగి ఉండేవాళ్ళు. రాజ్యానికి శత్రుభయం లేకుండా చేశాడు. స్థిరమైన పరిపాలన నెలకొల్పాడు. అతడంటే ప్రజలకు అభిమానమూ, భయమూ, భక్తీ ఉండేవి. అందువల్ల, ఒకరకంగా ఆలోచిస్తే, రాణి రుద్రమదేవి పని చాలా తేలిక అయిపోయింది. ఆనాటి రాజులు కొన్ని దేశాలలోని ఈనాటి రాజులవలె పేరుకు మాత్రం రాజులుగా ఉండే వారు కాదు. చాలా వ్యవహారలలో స్వయంగా చొరవ తీసుకొని శ్రద్ధగా పరిపాలించేవారు. అంత మాత్రాన మంత్రుల మాటలను లెక్కపెట్టేవారు కాదని అనుకోనవసరం లేదు. తగిన మర్యాద ఇచ్చి వారిని సంప్రతించే వారు. సలహాలు తీసుకునేవారు. అయితే ప్రతి ముఖ్య విషయంలోను చివరిమాట వారిదిగా ఉండేది. ఈ సంప్రదాయాన్ని పాటించిన గణపతి దేవుడు కాకతీయ సామ్రాజ్యం గట్టిగా నిలబడటానికి కృషి చేశాడు."

రవి ఆవలించాడు.

"మరి ఇంత పటిష్టమైన రాజ్యం తండ్రి రాణి రుద్రమదేవికి ఇచ్చిపోతే, రాణి రుద్రమదేవి ఎందుకు యుద్ధాలు చెయ్యాల్సి వచ్చింది?" ఆదుర్దాగా అడిగింది రమ.

"ఇందాకటి నుండి వింటున్నావు కదే రవి మాటలు! ఇంత పెద్ద రాజ్యానికి స్త్రీ పరిపాలకురాలు అయితే చూస్తూ ఊరు కుంటారటే సామంతులు? 'స్త్రీ రాజ్యం చేయకూడదు. అబల అయిన ఆడది మాకు రాణిగా ఉండ తగదు' అని తిరుగుబాటు ప్రయత్నాలు చేశారు కొంతమంది సామంతులు."

"మరేమవుతుంది?" అన్నాడు రవి.

"మాకు శరీర బలం లేదని ఎవరన్నారు? అది ఒక కల్పన మాత్రమే. నేను నిన్ను ఇప్పుడు కొట్టి, నెట్టి పడేయగలను. తెలిసిందా? కావాలంటే చేసి చూపిస్తా. ఆడది అబల అనుకోవటం ఒక భ్రమ

మాత్రమే. పల్నాటి నాగమ్మ శత్రువులతో పోరి, గెలిచి, ఎంతో చాకచక్యంతో రాజ్యాన్ని నడిపించలేదా? అంతరిక్ష నౌకలో ప్రయాణం చేసిన వారిలో వాలంటీనా మహిళ కాదా? ఎవరెస్టు శిఖరాన్ని భారతీయ యువతి కుమారి బచేంద్రపాల్ ఎక్కలేదా? ఇన్ని చేయటానికి అడ్డురాని ఆడతనం సింహాసనం మీద కూర్చుని దేశాన్ని పరిపాలించేందుకు వస్తుందా?" రమ పట్టరాని ఆవేశంతో రవి మీద విరుచుకుపడ్డది

"ఎవరి గొప్ప వారిది. మాతో పోటీ పడితే మాత్రం ఓటమి మీదే!" సవాల్ చేస్తూ రవి అన్నాడు.

"మీరిద్దరూ ఇలా దెబ్బలాడుకుంటుంటే కథ ఎలా చెప్పేదర్రా. నా ముఖం వైపు చూస్తూ వింటేనే పూర్తిగా చెపుతా తెలిసిందా? రాణిపైన, ముఖ్యంగా, స్త్రీ పరిపాలన మీద ఇష్టంలేని సామంతులు తిరగబడ్డారు అప్పుడామె వాళ్ళను లొంగదీయటానికి యుద్ధాలు చేయక తప్పలేదు. మరేం చేస్తుంది?" అంటూ కథనం సాగించింది మామ్మ.

"నాకు యుద్ధాలంటే భలే ఇష్టం మామ్మా. వాటి కథ రేపు చెప్పు. నాకు నిద్ర వస్తోంది" అన్నాడు రవి.

"సరేనర్రా, మిగతా కథ రేపు చెప్తాను" అని మామ్మ పిల్లలిద్దర్నీ నిద్రబుచ్చింది.

రవి, రమ ఇద్దరూ ఆసక్తితో రుద్రమ చేసిన యుద్ధాల కథలు వినటానికి మరునాటి రాత్రి వాళ్ళ మామ్మ దగ్గర చేరారు.

"మామ్మా! కథ సాగించు" అడిగాడు రవి.

"రుద్రమదేవి గెలిచిన యుద్ధాలు ముందు చెప్పు" అన్నది రమ.

"కాదు, వరుసగా చెప్పు మామ్మా!" అన్నాడు రవి.

"ఒరేయ్! ఆపండి మీ పోట్లాట. కథ చెప్పేది నేను. నా ఇష్టం వచ్చినట్లు చెప్తా. మీరు వినక తప్పదు." తన అధికారాన్ని ప్రవర్శించింది మామ్మ.



మౌనం వహించారు, అక్కా-తమ్ముళ్ళు మామ్మ కథ ఎత్తుకుంది:

"రాణి రుద్రమదేవి అధికారంలోకి రాగానే సామంతులు ఎదురు తిరిగారు.

"ఆడది సింహాసనం మీద కూర్చుంటే మేము తలవంచి, ఆమె పాదాలకు నమస్కరించం" అని బీరాలు పలికారు.

కొంతమంది సామంతరాజులు తిరుగుబాటు జెండా ఎగుర వేశారు. గోదావరి తీరాన ఉన్న మండలాధిపతులు స్వాతంత్ర్యాన్ని ప్రకటిస్తే, రాణి ఎడల స్వామిభక్తి గల ఇతర మండలాధిపతులు తిరుగుబాటుదార్లను అణచివేసి రాజ్య సుస్థిరతను కాపాడారు. అలా రాజ్యం చీలిపోకుండా జాగ్రత్త పడ్డారు.

మాత్రమే. పలనాటి నాగమ్మ శత్రువులతో పోరి, గెలిచి, ఎంతో చాకచక్యంతో రాజ్యాన్ని నడిపించలేదా? అంతరిక్ష నౌకలో ప్రయాణం చేసిన వారిలో వాలంటీనా మహిళ కాదా? ఎవరెస్టు శిఖరాన్ని భారతీయ యువతి కుమారి బచేంద్రపాల్ ఎక్కలేదా? ఇన్ని చేయటానికి అడ్డురాని ఆడతనం సింహాసనం మీద కూర్చుని దేశాన్ని పరిపాలించేందుకు వస్తుందా?" రమ పట్టరాని ఆవేశంతో రవి మీద విరుచుకుపడ్డది

"ఎవరి గొప్ప వారిది. మాతో పోటీ పడితే మాత్రం ఓటమి మీదే!" సవాల్ చేస్తూ రవి అన్నాడు.

"మీరిద్దరూ ఇలా దెబ్బలాడుకుంటుంటే కథ ఎలా చెప్పేదర్రా. నా ముఖం వైపు చూస్తూ వింటేనే పూర్తిగా చెపుతా తెలిసిందా? రాణిపైన, ముఖ్యంగా, స్త్రీ పరిపాలన మీద ఇష్టంలేని సామంతులు తిరగబడ్డారు అప్పుడామె వాళ్ళను లొంగదీయటానికి యుద్ధాలు చేయక తప్పలేదు. మరేం చేస్తుంది?" అంటూ కథనం సాగించింది మామ్మ.

"నాకు యుద్ధాలంటే భలే ఇష్టం మామ్మా. వాటి కథ రేపు చెప్పు. నాకు నిద్ర వస్తోంది" అన్నాడు రవి.

"సరేనర్రా, మిగతా కథ రేపు చెప్తాను" అని మామ్మ పిల్లలిద్దర్నీ నిద్రబుచ్చింది.

రవి, రమ ఇద్దరూ ఆసక్తితో రుద్రమ చేసిన యుద్ధాల కథలు వినటానికి మరునాటి రాత్రి వాళ్ళ మామ్మ దగ్గర చేరారు.

"మామ్మా! కథ సాగించు" అడిగాడు రవి.

"రుద్రమదేవి గెలిచిన యుద్ధాలు ముందు చెప్పు" అన్నది రమ.

"కాదు, వరుసగా చెప్పు మామ్మా!" అన్నాడు రవి.

"ఒరేయ్! ఆపండి మీ పోట్లాట. కథ చెప్పేది నేను. నా ఇష్టం వచ్చినట్లు చెప్తా. మీరు వినక తప్పదు." తన అధికారాన్ని ప్రవర్శించింది మామ్మ.



మౌనం వహించారు, అక్కాతమ్ముళ్ళు మామ్మ కథ ఎత్తుకుంది:

"రాణి రుద్రమదేవి అధికారంలోకి రాగానే సామంతులు ఎదురు తిరిగారు.

"ఆడది సింహాసనం మీద కూర్చుంటే మేము తలవంచి, ఆమె పాదాలకు నమస్కారించం" అని బీరాలు పలికారు.

కొంతమంది సామంతరాజులు తిరుగుబాటు జెండా ఎగుర వేశారు. గోదావరి తీరాన ఉన్న మండలాధిపతులు స్వాతంత్ర్యాన్ని ప్రకటిస్తే, రాణి ఎడల స్వామిభక్తి గల ఇతర మండలాధిపతులు తిరుగుబాటుదార్లను అణచివేసి రాజ్య సుస్థిరతను కాపాడారు. అలా రాజ్యం చీలిపోకుండా జాగ్రత్త పడ్డారు.

రుద్రమదేవి సవతి సోదరులు హరిహరదేవుడు, మురారిదేవుడు అనేవారు తిరుగుబాటు చేశారు. ఆమె దేవతాదర్శనానికై మొగిలిచర్ల వెళ్ళింది. ఈ సోదరులు అప్పుడు ఓరుగల్లు కోటలో ప్రవేశించి, దుర్గ ద్వారాలు మూయించి ఆమెను కోటలోకి రాకుండా చేయాలని ప్రయత్నించారు. కాని వారి ప్రయత్నం విఫలమయింది. ఆమెకు నమ్మకమైన సేనానులున్నారు. అభిమానించే ఓరుగల్లు పట్టణప్రజలున్నారు. వీరందరి సహాయంతో ఆమె కోటను స్వాధీనం చేసుకుంది. ఈ సందర్భంగానే రేచర్ల ప్రసాదిత్యనాయుడు అనే వీరసేనాని ఆమెకు అండగా నిలబడ్డాడు. తన కుటుంబంవారు చేసిన కుట్రను ఇలా ఆమె భగ్నపరిచింది.

సామ్రాజ్యానికి దక్షిణాన పాండ్యరాజు జటావర్మ రాజ్యం చేస్తున్నాడు. అతడు మహా పరాక్రమవంతుడు. నెల్లూరుపై పోరాటానికి దిగాడు. నెల్లూరులో కాకతీయులకు సామంతుడైన మనుమసిద్ధిని ఓడించాడు. కాకతీయుల సైన్యం ముత్తుకూరులో పాండ్యరాజు చేతిలో ఓడిపోయింది. ఇది 1261 లో జరిగింది."

"రాణి ఊరుకుందా?" రమ అడిగింది.

"ఊరుకోలేదు. తోకతొక్కిన త్రాచు అయ్యింది. శత్రువులను మట్టు పెట్టటానికి సిద్ధపడింది. సైన్యాన్ని తయారు చేసింది. కోటలను కట్టుదిట్టం చేసింది."

"అయితే మామ్మా! ఈమె ఇలా తయారవుతూంటే మిగతావాళ్ళు చూస్తూ ఊరుకున్నారా?" రవి ప్రశ్నించాడు.

"రవి అన్న మాట నిజమే. వాళ్ళు ఊరుకోలేదు. దేవగిరి అనే నగరంలో యాదవ వంశానికి చెందిన మహదేవరాజు రాజ్యం చేస్తూ ఉండేవాడు.

దేవగిరి రాజ్యం యాదవుల రాజ్యం. అది కాకతీయుల సామ్రాజ్యానికి ఆనుకొని ఉంది.

మహాదేవరాజు మూడులక్షల సైన్యంతో ఓరుగల్లు మీదికి దండెత్తి వచ్చాడు."

"అప్పుడు రాణి ఏంచేస్తున్నది?" తన ఆదుర్దాను వెలిబుచ్చింది రమ.

"రాణి అప్పుడు దేవతలకు పూజలు చేయిస్తున్నది. తమ వంశపు ఇలవేల్పు కాకతికి పూజ చేసింది. అనుమకొండలోని పద్మాక్షి దేవికి



అర్చన చేయించింది. మొగిలిచర్లలోని దేవతకు పూజ చేస్తుండగా, ఆమెకు దండయాత్ర కబురొచ్చింది. రాణి పరివారం గుర్రాలను దౌడు తీయించి కోటకు చేరారు.

"భలే భలే! మంచి పని చేసింది" తన సంతోషాన్ని తెలియ చేసింది రమ.

"రాణి రుద్రమదేవి కోట తలుపులు మూయించింది. కోట బురుజులపై సేనలను ఉంచింది. దేవగిరి రాజు సేనలను హతమార్చడానికి కోట గోడల మీద కొండరాళ్ళు, ఇనుపగుండ్లు అన్నీ సిద్ధం చేయించింది. యాదవరాజు సైన్యం రానే వచ్చింది అతను మహాగర్వంగా ఉన్నాడు." చెప్తోంది మామ్మ.

"ఏం చూసుకొని మామ్మా అంత గర్వం?" తన సందేహాన్ని తెలియపరిచింది రమ.

"దేవగిరి రాజు మూడులక్షల సైన్యంతో వచ్చాడట. పైగా రుద్రమదేవి స్త్రీ కదా. ఆమె వెంటనే లొంగిపోతుందని ఆశించాడు."

"మరి ఆమె లొంగిపోలేదా?" రవి ఆత్రుతగా అన్నాడు.

"రాణి రుద్రమదేవి లొంగిపోలేదు. ఇతరులకు లొంగి వుండే మనస్తత్వం రాణికి లేదు. సేవణరాజు రాయబారాన్ని త్రిప్పికొట్టింది."

"రాయబారం ఏమని తెచ్చారు మామ్మా!" రవి ఓపిక పట్టలేక అడిగాడు.

"నీవు మాకు లొంగిపోయి, మా సామంతురాలుగా ఉంటూ, ఏటా పెద్ద మొత్తం కప్పం కట్టాలి అని దాని సారాంశం." మామ్మ వివరించి చెప్పింది.

"పాపం! ఎంత ఆశ!" తన జుగుప్సను వెల్లడించింది రమ.

"ఇంతకూ ఆ రాయబారాన్ని మోసుకొచ్చింది ఎవరు?" మళ్ళా అడిగాడు రవి.

"ఆ రాయబారాన్ని తెచ్చినవారు ఆమె సవతి సోదరులు హరిహర దేవుడు, మురారి దేవుడు అనే వారని ప్రతీతి."

"అయితే మామ్మా! మునుపొకసారి ఈ అన్నదమ్ములు ఆమె దెబ్బ రుచి చూశారు కదా! మళ్ళీ ఎందుకు వచ్చారు రంగం మీదికి?" తన ఆశ్చర్యా వ్యక్తపరిచింది రమ.

"మాడమ్మా! ఆశ మహాచెడ్డది."

"కాకతీయ సామ్రాజ్యంపై పెత్తనంకోసం తెలుగు సామ్రాజ్యానికి ద్రోహం తలపెడతారా? తెలుగు వారెవరైనా?" రమ తన అనుమానాన్ని వెలిబుచ్చింది.

"అమ్మాయి! ఇలాంటి వ్యవహారాల్లో ఎవరి సొంత లాభం వారు చూచుకుంటారు. అప్పుడు ఇది తెలుగు సామ్రాజ్యమని, తాము తెలుగు బిడ్డలమని గుర్తు ఉండదు. ఆమె సవతి సోదరులకూ అంతే!"

"మరి అనేకమంది మంత్రులూ, సేనానులు, ప్రజలూ ఉన్నారు కదా! వారూ అలాగే చేశారా?" సమాధానం కోసం మామ్మ కళ్ళల్లోకి చూసింది రమ.

"లేదమ్మా! రతిమ్మా వాళ్ళంతా, అన్ని కులాలవాళ్ళూ, అన్ని వృత్తుల వాళ్ళూ, అన్ని రకాల ఉద్యోగస్థులూ అందరూ రాణికి అండగా నిలిచారు."

"ఏం జరిగింది మామ్మా?" రవి కుతూహలంగా అన్నాడు.

"దేవగిరి సేనలు ఓరుగల్లు కోటను 15 రోజులు ముట్టడి చేశాయి. అంతకుముందే జాగ్రత్తపడ్డ రాణి కోటలో ఆహార పదార్థాలు. సైన్యాలు, ఆయుధాలు, మంచినీటి వసతి అన్నీ ఏర్పరచింది. దేవగిరి సైన్యంలోని ఏనుగులు కోట తలుపులను బద్దలు కొట్టలేకపోయాయి. వాడి అయిన ఇనుపముక్కలు తగిలి ఏనుగుల తలల బద్దలైనాయి. బురుజులపై నుండి, కోటగోడలపై నుండి వచ్చే బాణాలకు, ఇనుపగుండ్లకు, రాళ్ళకు పదాతి సేన బాగా దెబ్బతిన్నది. మహాదేవరాజు చేసేది లేక ముట్టడి తీసివేసి దేవగిరి మార్గం పట్టాడు.

అప్పుడు రాణి కోట తలుపులు తీయించి తన సైన్యాన్ని వారి వెంటబడి తరుమమని ఆదేశించింది. నాగచమూపతి అనే సేనానికి ఆ పని అప్పజెప్పింది.

అతని ధాటికి ఆగలేక పోయాడు దేవగిరిరాజు. కాకతీయ సేనలు దేవగిరిని ముట్టడించినట్లు కథ ఉంది. భయపడిపోయిన దేవగిరి రాజు మహదేవరాజు రాణికి లొంగిపోయి సంధి చేసుకున్నాడు. కోటి



హొన్నుల బంగారు నాణేలను నష్టపరిహారం క్రింద రాణికి చెల్లించాడు. గోదావరి పాయ గౌతమి దాటి తెలుగుదేశంలో అడుగు పెట్టనని మాట ఇచ్చాడు. అంతట తెలుగు సేనలు బీదరు మీదుగా ఓడుగల్లు చేరాయి. బీదరులో రాణిపేర శాసనాలు వేయించారు, కాకతీయ సేనానాయకులు. అంతటితో దేవగిరిరాజు మళ్ళీ తెలుగు గడ్డమీదికి రాణి రాజ్యం చేసినన్నాళ్ళూ కాలు పెట్టలేదు. ఈ కథ అంతా క్రీస్తుశకం 1260-70 ప్రాంతంలో జరిగింది."

"ఇంతకూ మామ్మా! కాకతీయ సామ్రాజ్యానికి చుట్టూ ఎవరి రాజ్యాలు ఉన్నాయి?" రవి ప్రశ్నించాడు.

"ఒకటి దేవగిరి రాజ్యం. దాని కథ ఇంతవరకు చెప్పానుకదా! తూర్పున కళింగగాంగుల రాజ్యం. మూడవది దక్షిణాన పాండ్యరాజ్యం."

"మరి ఇందులో దేవగిరివారు, గాంగులు ఓడిపోయారు రాణి చేతిలో. ఒక్క పాండ్యరాజు మాత్రం గెలిచాడటగా?" తనకు ఇంతకు క్రితం తెలిసిన విషయాన్ని బయట పెట్టింది రమ.

"అవునమ్మా సరిగ్గా చెప్పావు. అలాగే జరిగింది. గాంగ భూపతి మొదటి నరసింహదేవుడు - 1257-58 మధ్య జరిగిన గోదావరి యుద్ధంలో ఓడిపోయి వెనుకకు మరలాడు. కాని 1262 ప్రాంతంలో కొన్ని ప్రాంతాలను మరల ఆక్రమించాడు.

నిడదవోలులో రాణి అత్తింటివారు చాళుక్యులు రాజ్యం చేస్తున్నారు. కోనసీమలో వీరి బంధువులు హైహయులు రాజ్యం చేసేవారు. వీరిరువురూ స్వతంత్రులయినట్లు శాసనాలు వేయించారు. ఇది తెలిసికూడ బంధువులతో తగవులెందుకని రాణి చూసీ చూడనట్లు ఊరుకున్నది. కాని గాంగరాజు నరసింహదేవుని కుమారుడు గజపతి వీరభానుదేవుడూ, వడ్డాది మత్స్యరాజు, అర్జునదేవుడూ కలిసి రుద్రమదేవి రాజ్యం మీదికి దండెత్తారు. ఈసారి రుద్రమదేవి సహించలేదు. మహావీరుడు నల్లప నాయకుని కొడుకులు పోతినాయకుడు, ప్రోలినాయకుడు అనే వారిని సేనానులుగా నియమించి దండయాత్రను ఎదుర్కోమని పంపింది. వారు గాంగులను, మత్స్యులను ఓడించారు. మిగిలినవారిని తరిమారు. తరువాత కాకతీయ సామ్రాజ్యపు ఎల్లలు గోదావరి ఉత్తరానికి జరిగాయి.

ఇలా పడమర, తూర్పు దిశలలో రాణి రుద్రమదేవి ఆజ్ఞలు చెల్లాయి.

గంగయ సాహిణి అనే వీరుడు రుద్రమదేవి తండ్రి గణపతిదేవ మహారాజు కాలంలో మంచి పేరు సంపాదించాడు. సామ్రాజ్యానికి సేవ చేశాడు. అందుకు సంతోషించి గణపతిదేవుడు అతనికి కొంత రాజ్య ప్రాంతం ఇచ్చాడు. అతడు సామంతుడుగా ఉంటున్నాడు. అతడు చని పోయిన తర్వాత అతని మేనల్లుళ్ళు జన్నగదేవుడు, త్రిపురారిదేవుడు కాకతీయ సామ్రాజ్యానికి విధేయులుగా ఉన్నారు. కొంతకాలం జరిగాక వీరు రుద్రమదేవి అధికారాన్ని ధిక్కరించాలని ప్రయత్నించారు.

రాణి సేనలు మల్లాలగుండన సేనాని నాయకత్వాన వారికి బుద్ధి చెప్పాయి.

1264 నుండి కడప మండలం కాకతీయ సామ్రాజ్యంలో భాగ మయింది."

"మరి రాణి రుద్రమ దేవి జీవించి ఉన్న దాకా అలాగే ఉన్నదా మామ్మా?" రవి అడిగాడు.

"కాదు బాబూ! చాలా కథ ఉంది దానిని గురించి." మామ్మ బదులు పలికింది.

ఈసారి రమ కన్నులు మూతలు పడటం గమనించిన మామ్మ 'పోయి పడుకోండి' అని వారిద్దరిని నిద్రకు పంపి తాను నడుం వాల్చింది.

మూడవ రోజు రాత్రికి రవీ, రమా ఇద్దరూ మామ్మ దగ్గరికి చేరారు కుతూహలంతో.

రాణి రుద్రమదేవి దక్షిణాది యుద్ధాలలో ఓడిపోయిన వైనం తెలుసుకోవాలని ఆతృతగా ఉంది రవికి.

చివరకు రాణే జయిస్తుందనే ధీమాతో తరువాతి కథ వినాలని ఆస క్తితో కూర్చుంది రమ.



"మామ్మా! కడప, నెల్లూరు ప్రాంతాల కథలు చెప్పవూ?" కోరాడు రవి.

"వినండి నిన్న చెప్పానే, గంగయ సాహిణి అనే అతనిని గురించి. అతని మూడో మేనల్లుడు అంబదేవుడనేవాడు రాజ్యానికి వచ్చాడు. అతడు మహా బలవంతుడు, సమర్థుడు కూడాను. పాండ్యులతో తగాదా పెట్టుకొని వారిసేనలను కడప మండలాన్నుండి తరిమివేశాడు.

కాకతీయుల అండతో నెల్లూరును పరిపాలించేవాడు మనుమసిద్ధి. అతనిని తరిమివేశాడు చోళుల రాజు వీరరాజేంద్ర చోళుడు. రుద్రమ దేవి సామంతుడైన నాగమహాదేవరాజు గుంటూరులో పరిపాలన చేసేవాడు. అతడు చోళులను తరిమివేసి నెల్లూరును లోబరచుకున్నాడు. ఇది 1271-75 మధ్య జరిగింది. ఈ నాగదేవ మహారాజుకు గర్వం ఎక్కి కాకతీయు లను తిరస్కరించాడు.

అప్పుడు సర్వసేనాధిపతి అయిన పడికం చాపదేవుడు నాగ మహాదేవుని పీచమడిచాడు. మనుమసిద్ధి కుమారుడు కాకతీయ సేనల సహాయంతో మరల నెల్లూరును ఆక్రమించాడు. ఇలా నెల్లూరు ప్రాంతం తరచు చేతులు మారింది.

1282 ప్రాంతంలో అంబదేవుని సాయంతో మనుమగండ గోపాలు డనేవాడు మనుమసిద్ధి కొడుకును నెల్లూరునుండి వెళ్ళగొట్టాడు. అంబ దేవుడు తన బంధుత్వాల వల్ల కర్నూలు ప్రాంతంలో బలపడ్డాడు. ఇలా చిత్తూరు, కర్నూలు, కడప, నెల్లూరు ప్రాంతాలు కాకతీయ సామ్రాజ్యం నుండి విడిపడాయి.

రాణి రుద్రమదేవి వృద్ధురాలవుతోంది అన్న విషయం తెలిసి అంబదేవుడు విజృంభించాడు. రుద్రమదేవి సహించలేక పోయింది. తన సేననంతా మూడు భాగాలుగా చేసి వ్యూహం పన్నింది. మధ్య వాహినికి తనే నాయకత్వం వహించింది. దక్షిణ వాహినికి మనుమడయిన ప్రతాపరుద్రుని సేనానాయకునిగా నియమించింది. వామపక్షానికి ఆడిదం మల్లుగారు అధిపతి. రాణి ఆధ్వర్యాన నడచిన సేన 72 దుర్గాలను పట్టు కున్నది. త్రిపురాంతక ప్రాంతాన్నుండి అంబదేవుని సైన్యాలను తరిమి వేసింది. ఈమెకు సోమనమంత్రి కొడుకు మనుమ గన్నయ, సోమన మంత్రి తమ్ముడు పెదగన్నయ బాసటగా నిలిచారు. కాకతీయ సేన యొక్క దక్షిణవాహిని నెల్లూరుపై దండయాత్ర చేసి, అంబదేవుని మిత్రు డైన మనుమగొండ గోపాలుని చంపివేసింది. ఇది క్రీ. శ. 1294 లో జరిగింది. చెరకురెడ్లు అంబదేవుని బందుగులు వారిని లొంగదీశారు మల్లుగారు. అంబదేవుని రాజ్యం చాలా చిన్నదయిపోయింది. ఈ దండ యాత్రలతో నెల్లూరు ప్రాంతం కాకతీయ సామ్రాజ్యంలో భాగమయింది.

రుద్రమదేవి సైన్యం పడమటికి నడిచింది. దానికి ఆధిపత్యం వహించింది గోన గన్నారెడ్డి అనే మహావీరుడు."

"మామ్మా! గోన గన్నారెడ్డి అనే పేరుతో ఆడవి బాపిరాజుగారి నవల చదివాను నేను" అన్నది రమ.



'అవునమ్మా! అతడు చాలా పేరు ప్రఖ్యాతులు కలవాడు. ఈయన మహబూబ్‌నగర్ జిల్లాలోని వర్ధమానపురం రాజధానిగా రాజ్యం చేశాడు. ఈయన చేతికింది సేనాపతి విఠలుడు. పడమటకు నడిచి కర్ణాటాంధ్ర సరిహద్దులలో ఉన్న కోటలను అనేకం పట్టుకున్నాడు.

క్రీ శ. 1294లో రాయచూరు పట్టుకొని రాయచూరు దుర్గం కట్టించి నట్లు శాసనం వేయించాడు. ఇది రుద్రమదేవి ఆఖరు విజయమని చరిత్ర కారులు నమ్ముతున్నారు."

"ఇంతకూ రుద్రమదేవి ఎన్ని ఏళ్ల రాజ్యం చేసింది మామ్మా!" రవి ప్రశ్నించాడు.

"ఆమె రాణిగా పట్టాభిషేకం అయింది క్రీ శ. 1261 అని కొందరు, చనిపోయింది క్రీ. శ. 1289 అని కొందరూ, కాదు, క్రీ. శ. 1295 అని మరికొందరూ చరిత్రకారులు వాదిస్తున్నారు క్రీ శ. 1294 వరకు ఆమె పేరనే సామ్రాజ్యం సాగిందని ఒకరకంగా అనుకున్నా తప్పులేదు. ఏదైనా ముప్ఫయి నాలుగు సంవత్సరాలు ఏకచ్ఛత్రాధిపత్యంగా రాజ్యం చేసింది రుద్రమదేవి.

రాణికి యుద్ధాలలో సహాయం చేసిన అన్నమాత్యుడు అనే బ్రహ్మణుడు ఆమె కథలలో వినబడతాడు. అతడు కళింగులపై దండయాత్ర నడిపినట్లు చెపుతారు.

"మరి రాణి ఇంత వీరాంగన కదా! ఆమె చెల్లెలు గణపాంబ పేరు వినపడదా చరిత్రలో?" రమ అడిగింది.

"రాణి చెల్లెలు గణపాంబ వీరవనిత. ఆమెను కోట బేతరాజు అని ధరణికోట రాజుకిచ్చి వివాహం చేశాడు గణపతిదేవుడు. భర్త చనిపోయిన తరువాత గణపాంబ తన అక్కగారి సామంత రాణిగా ధరణికోటలో 40 సంవత్సరాలు రాజ్యం చేసింది. పేరుకు సామంత రాణి అయినా ఆమె ఇంచుమించుగా స్వతంత్రంగానే పరిపాలించింది.

రుద్రమదేవి సేనానులు తమను 'రుద్రదేవ దక్షిణ భుజాదండ' అని పిలుచుకోవటానికి గర్వపడేవారు. అడిదం మల్లు సేనాని, గోన గన్నారెడ్డి అలాంటి ప్రముఖులు. దీనిని బట్టి పెద్ద సేనాధిపతులు సహితం యుద్ధాను నడపటంలో రుద్రమదేవికి కల నేర్పును గౌరవించినట్లు కనపడుతుంది.

ఆమే స్వయంగా నడిపినవి రెండు యుద్ధాలు. ఒకటి దేవగిరి రాజు ఓరుగల్లును ముట్టడించి నప్పుడు. రెండవది అంబదేవునిపై దండయాత్రలో సేన మధ్యవాహినికి నాయకత్వం వహించిన సందర్భంలో.

ఇవి ఆమె ధైర్యసాహసాలకు నిదర్శనాలు.

ఆమెకు అంగరక్షకులు ఉండేవారు. ఎన్కినాయడు,రుద్రినాయడు, పినమల్రినాయడు, పోతినాయడు వారిలో పేరెన్నిక గన్నవారు. ఆ రోజులలో వ్యవహారాలు చూసే అధికారులు, సైన్యాధికారులు అని తేడా లేకుండేది.

అందరూ అవసరమయినపుడు కత్తి పట్టవలసిందే. కులంతో, కులవృత్తితో పనిలేదు.

అన్నయామాత్యుడు బ్రాహ్మణుడయినా సైన్యాలు నడిపాడు; యుద్ధాలు చేశాడు.

రాణి రుద్రమదేవి సైన్యంలో క్షత్రియులు, కాపులు, కమ్మవారు, పద్మనాయక వెలమలు, కాయస్థులు-వారు వీరు అననేల-అన్ని కులాల వారు ఉండేవారు. అందరికీ వారి వారి శక్తిసామర్థ్యాలనుబట్టి తగు విధంగా గౌరవం, హోదా లభించేవి.

రుద్రమదేవి దయకు పాత్రుడయిన వాడినని కూడ చెప్పుకున్నాడు ఒక సామంతుడు.

రాణి రుద్రమదేవి అంటే అంత భయమూ, భక్తీ, గౌరవమూ, అభిమానమూ ఉండేవి వీరులకు, సైనికులకు. ఇందరి విశ్వాసాన్ని చూరగొన్న ఆ తల్లి చాలా గొప్ప రాణి అని చెప్పుకోవాలి; నారీమణులలో మణిపూస అని ఆమెను అభినందించక తప్పదు. రుద్రమదేవి పరిపాలనా కాలంలో 'మార్కోపోలో' అను ఇటలీ యాత్రికుడు మన దేశం మీదుగా పోతూ కాకతీయ పరిపాలకుల సమర్థత గురించి, వారి రాజ్యం యొక్క మహదైశ్వర్యం, వారి పరిపాలనా దక్షత, సాహిత్యసేవ, శిల్ప కళలను శ్లాఘిస్తూ తన డైరీలో రాసుకున్నట్లు చదివాం కూడాను."

మామ్మ చివరి మాటలు వినకుండానే రవి నిద్రపోయాడు. రమ గోడ కొరిగింది నిద్రమైకంలో. ఆనాటికి మామ్మ కథ చాలించింది.

నాలుగోరోజు రా॥ వాళ్ళ మామ్మ వద్దకు చాలాముందుగా చేరారు రవీ, రమలు.



"మామ్మా! నిన్న మొన్న యుద్ధాలతొ గడచిపోయింది. రాణి చేసినవన్నీ యుద్ధాలేనా? ఇంకా ఏమైనా ప్రజలకు మేలు జరిగే పనులు చేసిందా?" అని ప్రశ్నిస్తూ కథను కొనసాగించమని తొందర పెట్టారు.

"చేయకేమిరా! ఆ మంచి పనులను గురించి చెప్పే ముందు ఆమెకు పరిపాలనలో గల నేర్పును గురించి కొంత చెప్తారా. కాస్త ఓపిక పట్టండి.

ఆమెకు ఎన్నో గొప్ప గుణాలు ఉన్నాయి. ఆమెకు శక్తి ఉంది; సమర్థత ఉంది, అందరినీ సమంగా, న్యాయంగా చూసే పద్ధతిని ఆమె చేపట్టింది. కవులనూ, పండితులనూ ఆదరించి పోషించింది.

ఆమె చరిత్ర అంతా ఒక మంచి కథగా చెప్తాను. వయసు ముదిరిన కారణాన నెమ్మదిగా చెప్తున్నాను" అని నచ్చచెప్పింది మామ్మ. చెవి యొగ్గి కూర్చున్నారు రమ, రవి.

''ఆమె పరిపాలనా కార్యాలలో మంచి నేర్పు చూపేది, తన సైని కుల స్వామి భక్తిని మారగొనేది.

దేవగిరి రాజు నష్టపరిహారం కింద కోటి హొన్నులు చెల్లించాడని విన్నాం కదా! అందులో షుమారు మూడవ వంతు పైకం ఆమె తన సైనికులకు వంచిపెట్టింది. విన్నారా?''

''మామ్మా! రోమను సామ్రాజ్యం పాలించిన జూలియస్ సీజరు కూడా ఇలా సైనికులకు పైకం బహుమతిగా ఇచ్చాడని మాస్కూల్లో టీచరు చెప్పింది'' అంది రమ.

''తనకు విధేయులుగా ఉన్న సామంతులను రాణి రుద్రమదేవి గౌరవించేది. ఎదిరించిన సామంతులను, తన మీద కుట్రచేసేవారిని శిక్షించేది.

ఇది మామూలుగా రాజులు నడుచుకునే పద్ధతే. అందువల్ల ఉద్యోగు లంతా ఆమె యెడల భక్తి శ్రద్ధలతో సంచరించేవారు. మంత్రుల సల హాలను కొన్ని పరిస్థితుల్లో పాటించేది. అంత మాత్రాన ఆమె వారి చేతిలో కీలుబొమ్మ అనుకోవడం పొరబాటు. ఆలోచనలో మంత్రులకు సాటిగా ఉండేది ఆమె. అందువల్లనే శివదేవయ్య, మల్లయ గుండనలాంటి మేథాసంపన్నులు ఆమెను గౌరవించేవారు.

మత సామరస్యం ఆ రోజుల్లో ఉన్నట్లు కనపడుతుంది, అన్ని మతాలవారు కలసి మెలసి జీవించేవారు. మొదట్లో కాకతీయ రాజులు జైనులుగా ఉండేవారు. తరువాత శైవ మతాన్ని చేపట్టారు. శైవం అంటే శివుణ్ణి పూజింపదగిన దేవునిగా గుర్తించటం. ఇందులో రెండురకాలు. ఒకటి వైదికం. అంటే వేదాల పద్ధతి అన్నమాట. రెండవది అవైదికం. అంటే మొదటిదానికి వ్యతిరేకం. వైదికంలో మళ్ళీ రెండు రకాలు. ఒకటి శివుడినీ, విష్ణుమూర్తినీ పూజించేది. దీనిని సాధారణ శైవ మనవచ్చు. రెండవ రకంవారు శివుడిని మాత్రమే పూజిస్తారు. వీరిని విశేష శైవులని

శేక ఆరాధ్య శైవులని అంటారు. ఈ రెండు శాఖలూ వర్ణాశ్రమాలను అంగీకరిస్తాయి. అంటే హిందూ సమాజాన్ని విభజించే వర్ణాలను, ప్రతి మనిషి జీవితంలో ఉండే బ్రహ్మచర్యం, వివాహ జీవితం మొదలైన వాటిని ఆమోదిస్తాయి. వీరశైవం వేద విరుద్ధం. దానిలో వర్ణాశ్రమ ధర్మాలు లేవు. కర్ణాటక దేశానికి చెందిన బసవేశ్వరుడు దాని మూల పురుషుడు. ఇంతకూ కాకతీయ రాజులలో ప్రముఖుడైన మొదటి ప్రోల రాజు కాలాముఖ శాఖకు చెందిన సాధారణ శైవుడు.

అతడు అన్యమతాలను నిరసించలేదు. రుద్రదేవుని కాలంలో వేయి స్తంభాల గుడి కట్టించడం జరిగింది. అందులో విష్ణువు, సూర్యభగ వానుడులాంటి దేవుళ్ళ విగ్రహాలు ఉన్నాయి. ఇది సమదృష్టి. గణపతి దేవుని కాలంలో పాశుపత శైవమనే మరో శాఖ శైవాన్ని చేపట్టారు రాజ వంశంవారు. అయినా జైనులను రాజులు హింసించినట్లు కానరాదు.

గణపతిదేవుని కుమార్తె రుద్రమదేవి తను అవలంబించిన పాశు పత శైవాన్ని పోషించింది. కాని ఇతర మతాలను, శాఖలను అణచి వేసి నట్లు ఆధారాలు ఎక్కడా లేవు. కనుక రాణి రుద్రమదేవి సర్వమత సమానత్వాన్ని కాకపోయినా సర్వమత సహనాన్ని ప్రదర్శించినట్లు కన్పడుతుంది. అన్ని మతాలను సమానంగా చూడకపోయినా ఏ మతాన్నీ అణచివేయలేదు. ఆ రోజుల్లో వర్ణధర్మాలు ఉండేవి. కుల ధర్మాలు, కుల వృత్తులూ సర్వ సాధారణంగా ఉండేవి. అవి ఇప్పటికన్నా కొంచెం కట్టుదిట్టంగా ఉండేవి.''

''అయితే రాణి రుద్రమదేవి కూడా వాటిని పాటించిందా?'' రవి అడిగాడు.

''మామూలుగా ఆమె వాటిని పాటించేది. కాని తన కుమార్తె రుయ్యమాంబ బ్రాహ్మణుడయిన అన్నయామాత్యుని వరిస్తే ఆ వివాహా నికి ఆమె తన అంగీకారం తెలిపి వారికి పెండ్లి చేసింది.

అ రోజుల్లో ప్రేమ వివాహానికి ఒప్పుకోవటం రాణి గొప్పతనం కాదట్రా?'' మామ్మ అడిగింది.



''అదీ నిజమే.'' అని అంగీకరించింది రమ.

''పోః రాజ్య పాలనం చేసేవారు శత్రువుల రహస్యాలను ముఖ్యంగా తెలుసుకోవాలి. దానికి ఒక గూఢచారి శాఖను నడపాలి. ఆ శాఖకు చెందిన వారికి ఆ పనిలో ప్రత్యేకమైన నైపుణ్యం ఉండాలి. అలాంటివారికే ఆ శాఖలో పని ఇవ్వాలి. రాణి ఈ విషయాలు బాగా ఆలోచించి అలా చేసేది. ఆరోజులలో వారికి నేటివలె ఎన్నో వెసులు బాట్లు లేక పోయినా శ్రద్ధ వారికీ ఎక్కువే. వారు ఏమరకుండా సరాసరి రాణికే బాధ్యులై సమాచారాన్ని అందజేసేవారు. ఏ కారణంవల్లనైనా ఆమె నగరంలో లేకపోతే ప్రధానమంత్రికి తెలియజేసేవారు. వారు రాజ్యానికి కన్నులు, చెవులవంటివారు. వారి వల్లనే రాజ్యం పరరాజుల బారిన పడకుండా రక్షింపబడేది. వీరిని 'చారులు' అనేవారు. వీరి చాక

చక్యం వల్లనే రాణి రుద్రమదేవి సమయం మించిపోని తరుణంలో దేవగిరి రాజయిన మహదేవరాజు దండయాత్ర సంగతి తెలుసుకో గలిగింది ఇదంతా ఆమె పరిపాలనా సామర్థ్యానికి మచ్చుతునక.'' రాణి పరిపాలనా దక్షత విశదీకరించింది మామ్మ.

''మరి మామ్మా! సైన్య నిర్మాణం, రక్షకదళాల నిర్మాణం ఎలా ఉండేవి ఆ రోజులలో? రమ'' పరిశోధనా పూర్వకమైన ప్రశ్నవేసింది.

''సైన్యం రెండు రకాలుగా ఉండేది. ఒకటి మూల సైన్యం. అంటే రాణిగారి సైన్యం. రెండవది సామంతులు సమీకరించి రాణి కోరినప్పుడు తెచ్చియిచ్చే సైన్యం. ఈ రెండు సైన్యాలతో దేశసైన్యం కూడి వుండేది. సామంతులకు వారి వారి ప్రాంతాలపై పెత్తనం ఉండేది. రుద్రమదేవికి కప్పం కట్టుతూ, ఆమెను సామ్రాజ్యాధిపతిగా అంగీకరిస్తూ, ఆమె కోరినప్పుడు సైన్యాలను అందిస్తూ, వాటికి సేనా నాయకత్వం వహిస్తూ ఉండడమే వారి ముఖ్య విధి. అలాంటివారిని సత్కరించే పద్ధతి కూడ ప్రత్యేకంగా ఉన్నది. పరరాజుల మండలాన్ని స్వాధీనం చేసుకోవడంలో ఏ సామంత రాజు సాయం చేస్తే ఆ ప్రాంతాన్ని మహారాణి ఆ సామంత రాజుకు ఇచ్చేస్తుంది. అంటే ఆ సామంత రాజు యొక్క రాజ్యం పెరుగుతుంది. దానితో అతని గౌరవమూ, హోదా పెరుగుతాయి. అతడు ఆమెకు విధేయుడుగా ఉండి, భక్తి శ్రద్ధలతో ఆమెను గౌరవిస్తాడు. అంతేకాదు, రాణిని అభిమానించి, మహారాణి ఆదేశాల మేరకు ప్రాణాలకు సైతం వెనుదీయక పోరాడుతాడు. ఇదంతా రాజనీతి చతురత. ఇది రాణి రుద్రమదేవికి వెన్నతో పెట్టిన విద్య. ఆమె తండ్రి నేర్పించిన విద్యకు ఆమె మెరుగు పెట్టుకుని సంతరించుకున్న సంపద ఇదే ఆమెకు సర్వదా రక్షగా నిలిచింది."

"అయితే మామ్మా! ఆ రోజుల్లో పోలీసులుండేవారా?" తనూ ఒక ప్రశ్న అడగాలని మధ్యలో ఆపి మామ్మను ప్రశ్నించాడు రవి.

''ఉండేవారు నాయనా! అయితే వారిని 'పోలీసులు' అనేవారు కాదు. మరో పేరు ఉండేది. వారిని గ్రామ రక్షకులు, నగర రక్షకులు అని పిలిచేవారు. వీరు తమ బాధ్యతను ఎంతో నమ్మకంగా నిర్వహించే వారు. గ్రామంలో శాంతి భద్రతలు కాపాడడం వారి ప్రత్యేక ధర్మం. దొంగతనాలు, దోపిడీలు, కొట్లాటలు, తగాదాలు లేకుండా చూడటం వారి

''మామ్మా! రాణి కాలంలో మంత్రులు ఎందరుండేవారు? వారికి శాఖలు కేటాయించే వారా?" అడిగింది రమ

''అమ్మాయి! చెపుతావిను. మంత్రి మండలిలో 18 నుండి 21 మంది వరకు ఉండేవారు. అచ్చంగా సమర్థత మీదనే ఆ ఉద్యోగాలు ఇచ్చేవారట. అందులో తేడాలున్నాయట. మహా ప్రధానులు, ప్రధానులు, అమాత్యులు, ప్రెగ్గడలు ఉండేవారు. వీరు చేసే వేరు వేరు పనులను గురించి మనకు అట్టే తెలియదు."

''అయితే మామ్మా! మన ప్రభుత్వంలో శాఖలు వుంటాయి కదా, విద్యాశాఖ, పోలీసుశాఖ అని. అలాగే రాణి కాలంలో కూడా ఉండేవా?"

''లేకేమిరా! ప్రభుత్వోద్యోగాలలో 72 శాఖలున్నట్లు తెలుస్తున్నది. ఈ ఉద్యోగాలను 'నియోగములు' అనేవారట. రాజు తరువాత ప్రభుత్వ భారం వహించేది సామంత శూర కుటుంబాలవారు.

మరచిపోయానురా! సైన్యంలో చతురంగ బలాలు లేవు. అంటే రథాలు, ఏనుగులు, గుఱ్ఱాలు, కాలిబంట్లు – వీటిని చతురంగ బలాలు అంటారు కదా! రథాలు ఆ కాలానికి లేకుండా పోయాయి. కనుక గజ

దళం, ఆశ్విక దళం, పదాతి దళం మాత్రమే ఉండేవి. పదాతి దళంలో విల్లు అంబులు చేతబట్టి నడిచేవారికి ప్రాముఖ్యత జాస్తి. రుద్రమదేవి మనుమడు ప్రతాపరుద్రుడికి 'నవ లక్ష ధనుర్ధరాధిపతి' అని బిరుదు వుండేది. అంటే 9 లక్షల మంది విలుకాండ్రు ఆయన సైన్యంలో ఉన్నారన్న మాట. అంతగా కాకపోయినా, రుద్రమదేవి కాలంలో కూడ లక్షల సంఖ్యలోనే విలుకాండ్రు ఉండేవారు. కోట గోడలపై నుండి ముట్టడించే వారిని సంహరించడం, ముట్టడి సైన్యంలో ఉండి కోటగోడల వారిని చంపడం ఇవి వీరి పనులు. కత్తి వీసడు దూరాన ఉన్న శత్రువుని చంపలేదు కదా! కోట అంటే గుర్తుకొచ్చింది. కోటలు ఎన్ని రకాలు ఉండేవో తెలుసా?"

"తెలియదు మామ్మా!" అన్నాడు రవి.

"కోటలు నాలుగు రకాలుగా ఉండేవి. స్థల దుర్గాలు మొదటి రకం, అంటే ఎగుడు దిగుడు లేనిచోట కట్టేవి. ఓరుగల్లు, ధరణి కోట లాంటివి. జలదుర్గాలు రెండవ రకం. దివి, కొలను వంటివి. దివి అంటే కృష్ణానదీ పాయల మధ్యనున్న ప్రాంతం. కొలను అంటే 'కొల్లేరు సరస్సు' అని పేరు వినలేదూ? అంటే చుట్టూ నీరూ మధ్య భూమి ప్రాంతం ఉంటే అచ్చట కట్టేవి అన్నమాట. శత్రువులు చుట్టూ ఉన్న నదులను, సరస్సును దాటి రావాలి కదా! అలా రావడం కష్టం. అందుకని అలా కొన్ని కోటలు కట్టేవారు. మూడవది కొండలమీద కట్టేవి. వీటిని పర్వత దుర్గాలంటారు. అనుమకొండ, కొండపల్లి, రాయచూరు, ఖమ్మంమెట్టు, గండికోట వంటివి. నాల్గవరకం వనదుర్గాలు - అంటే అడవుల మధ్య కట్టేవి. ప్రతి దుర్గాన్ని రక్షించటానికి నాయకులుంటారు. వారిపైన దుర్గాధ్యక్షుడు ఉంటాడు. ఏకశిలా నగర దుర్గాన్ని - అంటే ఓరుగల్లు కోటను రక్షించటానికి 72 మంది నాయకులు ఉండేవారు. బురుజుకు ఒక్కొక్క

నాయకుడు ఉండేవాడు. ఇలా దేశ రక్షణ కార్యక్రమం కట్టుదిట్టంగా ఉండేది రాణి రుద్రమదేవి కాలంలో."

"వారి రాజ్యంలో జిల్లాలు, తాలూకాలు, మండలాలు ఉండేవా?" రమ వెంటనే అడిగేసింది.

"జిల్లాలు, తాలూకాలు, మండలాలు అనే పదాలు అప్పుడు వాడుకలో లేవు. అవి ఇటీవలనే వాడుకలోకి వచ్చాయి. ఆనాడు దేశాన్ని స్థలం, నాడు, విషయం, కంపనం మొదలగు విభాగాల కింద చేశారు.

'వాడి' అనే పేరు విన్నారు కదా! వాడి అంటే 'వాటి' అన్న మాట. అది కూడా ఒక రకపు ప్రాంతానికి పేరు. నతవాడి, మార్జ వాడి అలాంటివే. అయితే ఆ రోజుల్లో గ్రామ స్వపరిపాలన ఉండేదర్రా! గ్రామాధికారులు పన్నెండుమంది ఉండేవారు. కరణం, పెద్దకాపు లేక రెడ్డి, తలారి, పురోహితుడు, కమ్మరి, కంసాలి, వడ్రంగి, కుమ్మరి, చాకలి, మంగలి, వెట్టి, చర్మకారుడు వీరు. వీరంతా వృత్తివనివారు. వీరికి భూమిరూపంగా మాన్యాలుండేవి. అదీకాక రైతులు ధాన్యం కొలిచే వారు. వాటిని 'మేరలు' అనేవారు. వీరందరూ గ్రామస్థులందరితో కూడిన గ్రామ మహాజన సభకు అధీనులయి ఉండేవారు. కాగా అప్పుడు వర్ణాశ్రమ ధర్మాలు హిందూ శాస్త్ర ప్రకారం రక్షింపబడుతూ ఉండేవి. ఈ వ్యవస్థను రాణీ రుద్రమదేవి తన పూర్వీకులలాగానే రక్షించింది."

కళ్ళు నులుముకున్నాడు రవి.

తూలబోయి తట్టుకున్నది రమ.

ఈ వేళకి పడుకోమని చెప్పి కథ చాలించింది మామ్మ.

"మామ్మా! గ్రామంలో వృత్తి పనులు చేసే వాళ్ళను గురించి చెప్పావు. కాని పన్నులు ఎలా ఉండేవో రాణి రుద్రమదేవి సామ్రాజ్యంలో చెప్పవా?" బతిమాలింది రమ.

"పొలాల పంటనుబట్టి భూమి శిస్తు ఉండేది. పన్నుకట్టే కాపుఃను అరికాపులనేవారు భూములను మూడు రకాలుగా లెక్కకట్టేవారు.

నీరు నేల, వెలిపొలం, తోటపొలం అని ఉండేవి. నీరునేల అంటే మాగాణి అన్నమాట. అంటే సాగు నీటితో పండించే పొలం. వెలిపొలం అంటే మెట్టపొలం. వాన నీరుతో పండే పొలం. పన్నులు ధాన్య రూపంలో వసూలుచేసేవారు. కొన్ని సమయాల్లో నాణాల రూపంలో కూడా స్వీకరించేవారు. ధాన్యం కొలవడానికి కొలగాండ్రు ఉండేవారు. వెలిపొలం, తోట పొలాల మీద పన్ను నగదు రూపంలో ఉండేవి.

ఇక బాగా ప్రభుత్వానికి ఆదాయం తెచ్చే పన్ను వ్యాపార వస్తువుల మీద వేసే పన్నే."

"ఉప్పు మీద పన్ను ఉండేదా మామ్మా?" రవి అడిగాడు. అతనికి గాంధీగారి ఉప్పు సత్యాగ్రహం గుర్తు కొచ్చింది.

"ఉప్పుకొఠార్లు ఇప్పుడున్నట్లుగానే చినగంజాం, కడవకుదురు, చొంపరాల, కనువర్తి, దేవరంపల్లి, పెదగంజాం మున్నగు స్థలాల్లో ఉండేవి. ఉప్పుమీద కూడ సుంకం వసూలు చేసేవారు. మోటుపల్లి లాంటి రేవు పట్టణాలలో ఎగుమతి, దిగుమతి సుంకాలు ప్రభుత్వానికి చెల్లేవి."

"మరి మామ్మా! వీటిని వసూలు చేసేది ఎవరు? ఎలా వసూలు చేసేవారు?" రవి చాలా కుతూహలంతో అడిగాడు.

"భూమి శిస్తును వసూలు చేయటానికి మునసబు, కరణాలు ఉండే వారు. కాని వ్యాపారం మీద పన్నులు-అంటే ఎగుమతి, దిగుమతి పన్నులు, అంగళ్ళ మీద పన్నులు. అమ్మకాలమీద సుంకాలు వీటి అన్నింటినీ వర్తక సంఘాలు వసూలు చేసేవి. సరుకుల మీద ప్రభుత్వానికి రావలసిన ఆదాయాన్ని వసూలు చేసే హక్కును వేలం వేసేవారు."

"ఇప్పటి అమ్మకం పన్నువంటిది ఆమె కాలంలో కూడా ఉండేదా మామ్మా!" రమ అడిగింది.

"అవున్రా. ఆ రోజుల్లోనూ అమ్మకపు పన్ను ఉన్నది; అంగడి పన్నూ ఉన్నది. వీటిని "అమ్మకడ సుంకం" అనేవారు. సుంకం అంటే 'పన్ను' అని అర్థం. పన్ను వసూలు చేసేవాళ్ళను 'సుంకరులు' అనేవారు. ఒక్కొక్కప్పుడు వర్తక సమాజాల వారు ఎక్కువగా పన్నులు వసూలు చేసి ప్రజలను చాలా బాధపెట్టేవారు. అప్పుడప్పుడు ప్రభుత్వం కలగ జేసుకునేది. సంతలలో పన్నుల పట్టీలు వ్రేలాడ కట్టించేవారు. కాని సాధారణంగా వర్తక సంఘం వారి మాటే చలామణి అయ్యేది.

అడవులు ప్రభుత్వానివే అయినా వాటిలో గడ్డి గాదం ఏరుకునే హక్కు అడవి ప్రక్కన ఉన్న గ్రామాలవారికి ఎప్పటి నుంచో ఉంది. రాణి కాలంలో పన్ను అలాంటిదీ కాదు. అది బీళ్ళ మీద వేసేది. కొన్ని పొలాలలో పైరు వేయకుండా పశువుల కోసం గడ్డి పెంచుతారు. వాటిని బీళ్ళు అంటారు; వాటిలోని పచ్చిగడ్డిని వాడుకుంటారు. పొలాలలో ధాన్యపు కంకి పోగా వచ్చేది ఎండుగడ్డి.

సరుకులు ఒక ఊరి నుండి మరో ఊరికి సంచులలో కట్టి ఎద్దుల మీద వేసి తోసికొని వెళ్ళేవారనుకో. వాటికి-అంటే ఆ ఎద్దులకు 'పెరికె ఎడ్లు' అని పేరు. వాటికీ పన్ను వేసేది ఆ రోజులలో.

గ్రామాలను కాపాడే వారిని తలారులనేవారు. వారికోసం తలారి పన్ను ఉండేది. దేశాన్ని రక్షించటానికి కాలిబంట్లు ఉండేవారుకదా, వారి కోసం బంటుపన్ను వసూలు చేసేది.''

''మరి రాణికి స్వంతఖర్చు కోసం పైకం ఎలా వచ్చేది మామ్మా?''. రవి ప్రశ్నించాడు.

''రాణికి స్వంత పొలం వుండేది. దానిని 'రాచదొడ్డి' అనేవారు, దానిపై ఆదాయమంతా ఆమెది. ఆ రోజుల్లో ఒక ఆచారం వుండేది. రాజు, దేవుడు, గర్భిణీస్త్రీ, పసిపిల్లవాడు, వీరిలో ఎవరి దగ్గరకు వెళ్ళినా ఏదో ఒకటి తీసుకుని వెళ్ళాలని. పత్రం, పుష్పం, ఫలం, తోయం అన్నారు. కనీసం ఆకు, పూవు, పండు, తీర్థము ఏదో ఒకటి తీసుకొని వెళ్ళాలట. సాధారణంగా బహుమతులు తీసుకుని వెళ్ళేవారు. అలాగే కాకతీయ రాజులకు కూడ చెల్లేవి. వీటివల్ల ప్రభుత్వానికి మంచి ఆదాయం వచ్చేది.''

''మామ్మా! ఇలా ఇన్ని పన్నులుంటే ప్రజలు బాధపడరా?'' రవికి శంక కలిగి ప్రశ్నించాడు.

''బాధపడతారు నాయనా! తప్పదు. పన్నులు లేకపోతే ప్రభుత్వాలు అర నిముసం నడవవు. కాకపోతే పన్నులు వేసేటప్పుడు కొంచెం మంచీ చెడ్డా చూడాలి.

అయితే ఒక మాట గుర్తుంచుకోండి. పన్నులు వేసే పద్ధతి కన్నా వసూలు అయిన పైకం ఎలా, ఎవరికోసం ఖర్చు పెడుతున్నారనేది ముఖ్యం. ఆ డబ్బుతో ఆస్పత్రులు, పాఠశాలలు పెట్టారనుకో. చెరువులు,

సాగరాలు త్రవ్వించారనుకో. వాటిలోని నీరు వల్ల భూమికి నీరు అంది పంట పెరుగుతుందనుకో. అప్పుడు పన్నులు కాస్త బరువనిపించినా ఎవరూ బాధపడరు.

రుద్రమదేవి చాలా మంచి పనులు చేసింది. ప్రభుత్వపు పైకాన్ని ఆమె పెద్దగా స్వంతానికి వాడుకున్నట్లు కన్పడదు. దాని విషయం వివరంగా రేపు చెప్తాను'' అన్నది మామ్మ.

''అప్పుడు జనాభా లెక్కలుండేవా?'' రవి అడిగాడు.

''ఇప్పుడున్నంత వివరంగా జనాభా లెక్కల సేకరణ ఆనాడు లేదు. కాని ఒకరకమైన లెక్క ఉండేది. పేరు, కులము, వృత్తి, నివాసం మాత్రం లెక్క వ్రాసినట్లు ఆధారాలున్నాయి.''

మామ్మ లేచి పక్కమీదికి వాలింది.

# 6

''యుద్ధాలు, పన్నులు, అధికారులు - వారి పెత్తనం, ఎంత సేపూ ఇవి చెప్పావు. మామ్మ! రాణి రుద్రమదేవి ప్రజలకు చేసిన మంచి పనులేమిటో వరుసగా ఏకరువు పెట్టు'' అన్నాడు రవి మరునాడు.

''రుద్రమదేవి ప్రజలకు చేసిన మొదటి మంచిపని దేశరక్షణ. ఆ విషయంలో ఆమె ప్రతిభ చూపింది. ఓరుగల్లు కోటను రాణి పూర్వీకులు కట్టించారు. నగరం చుట్టూ వారు మట్టి గోడను నిర్మించారు. రుద్రమదేవి దానిని బలపరిచింది. మట్టి గోడలో నుండి బయటికి పోవటానికి సొరంగాన్ని ఆమె త్రవ్వించినట్లు కథ వున్నది ఆ సొరంగం ద్వారా మనుష్యులు అనుమకొండ - నేటి హనుమకొండ గుట్టకును, పద్మాక్షి గుట్టకును నడుమకు చేరేవారట. మట్టి గోడకు లోపల ఆమె కంప గోడను కట్టించిందట. కంప గోడ లోపల రాతి గోడ ఉండేదట. రాజసౌధాలకు ఆమె గట్టి ప్రాకారాలను కట్టించారట. ఒక నగరంనుండి మరో నగరా

నికి, ఒక ప్రాంతంనుండి మరో ప్రాంతానికి పోవటానికి రహదారులు ఉండాలా అక్కర్లేదా? అలాంటి రహదారులను రాణి బాగుచేయించింది కూడా. బాటల పొడవునా చెట్లు నాటించింది. దేవాలయాలు కట్టించింది. మఠాలకు దాన ధర్మాలు చేసింది.



రుద్రమదేవి ప్రజలను కన్న బిడ్డలవలే చూసుకునేది. దానాలు చేసేది. శిల్పకళ, చిత్రలేఖనం, సంగీతం, నృత్యం, సాహిత్యం లాంటి కళలను బాగా పోషించినట్లు చరిత్ర మనకు చెప్తున్నది. రాణి తను స్వయంగా యుద్ధ తంత్రం నేర్చిన వీరవనిత. వర్తకం, వ్యవసాయం ఆమె పరిపాలనలో బాగా అభివృద్ధి చెందాయి. వేడుకలు, వినోదాలతో ప్రజల జీవితం సుఖవంతమై వేయి ముఖాలతో విస్తరించింది. ఓరుగల్లు కోట, రామప్ప గుడి, వేయి స్తంభాల గుడి రాణి కాలంలో వైభవోపేతంగా వెలుగొందాయి. పాకాల, లక్నవరం, రామప్ప తటాకాలను శుచిగా, శుభ్రం చేయించి ప్రజావసరాలకు తగ్గకుండా నీరు నిల్వచేసి ఉంచేది. ఇలాగే ఇంకా మరెన్నో ప్రజలకు మేలు చేకూర్చే పనులు చేసి, చారులను నియమించి ఏమరుపాటు లేక ప్రజలను పరిపాలించిన ఘనత రాణీ రుద్రమ దేవికే చెల్లుతుంది.

రాణి ఉదార గుణాన్ని, పరిపాలనా బాధ్యతలనూ అన్నీ ఉదాహరణలతో వివరించాను గదరా! అయినా ఇంకా మరికొన్ని కొత్త విషయాలు చెప్తాను వింటావా? మహదేవరాజు ఇచ్చిన కోటి హొన్నుల బంగారు నాణెలలో తగినంత భాగాన్ని సైనికులకు పంచి పెట్టింది. విన్నారా? ఆడిగయినా, మగాడయినా, ఏ మనిషి అయినా వచ్చి తనకు అన్యాయం జరిగిందని ఆమెతో మొరపెట్టుకుంటే ఆమె వెంటనే విచారించి ఆ మనిషికి న్యాయం చేసింది.



రాణి సత్రాలు నెలకొల్పింది. గ్రామాలు దానం చేసి ఆ గ్రామాల ఆదాయంతో పాఠశాలలు, విద్యార్థులకు ఉచిత వసతి గృహాలు, ఆరోగ్యశాలలు, ప్రసూతిశాలలు నడిపేలా ఏర్పాటు చేసింది."

"అదిసరే కాని, మామ్మా! కాకతీయులు కాలంనాటి విషయాలు ఇన్ని చెప్పావే, ఇవన్నీ నీకు ఎలా తెలిశాయి?" రమ అడిగింది.

"అమ్మాయి! ఆ రోజుల్లో పెద్ద పెద్ద కవులుండేవారు. వారు సంస్కృతంలో, తెలుగులో పుస్తకాలు రాసేవారు. సాధారణ ప్రజల మామూలు రోజువారీ జీవితాలను గురించి వినుకొండ వల్లభరాయని 'క్రీడాభిరామం' పుస్తకంలో కన్పడుతుంది."

మామ్మా! ఆ పుస్తకాన్ని నేను బాబాయి గదిలో చూచాను'' అన్నాడు తేరుకున్న రవి.

'' 'మార్కండేయ పురాణం', 'శివయోగ సారం'లాంటి గ్రంథాలు ఆ కాలంలో వున్న ధనికుల, అధికారుల జీవిత విశేషాలను గురించి వివరంగా తెలిపాయి. విదేశీ యాత్రికులు - మార్కోపోలో, ఇబన్ బతూతా వంటివారు కాకతీయులు పాలించిన రోజుల్లో తెలుగుదేశాన్ని చూచి, వారు కన్నవీ, విన్నవీ అన్నీ రాశారు. మహాభారతం తెలుగు చేసిన ముగ్గురు పెద్ద కవులు పేర్లు మీకు తెలుసా?'' ప్రశ్నించింది మామ్మ.

"కవిత్రయం - నన్నయ్య, తిక్కన, ఎఱ్ఱాప్రెగ్గడ." వెంటనే సమాధానం చెప్పేసింది రమ.

''అందులో భారతంలో ఎక్కువ భాగం వ్రాసిన వారెవరు?''

''తిక్కన'' రమే సమాధానమిచ్చింది మళ్ళీ.

''ఆ తిక్కన సోమయాజి నెల్లూరును పాలించిన మనుమసిద్ధి ఆస్థానంలో ఉండేవాడు. నెల్లూరు కాకతీయుల సామంత రాజ్యం. తిక్కన భారతం రాయకముందు 'నిర్వచనోత్తర రామాయణం' అనే గ్రంథాన్ని రాశాడు. అందులో కాకతీయ సామంతుల జీవితాన్ని ఆయన చిత్రించాడు".

''అచ్చంగా వీటి ద్వారానేనా నీవు ఇంత సమాచారం చెప్పింది?'' సంశయం వెలిబుచ్చాడు రవి.

''కాదురా! ఆ కాలంలో రాజులు, రాణులు శిలాశాసనాలు వేయించారు. కొన్నింటిని సంస్కృతంలో, మరి కొన్నింటిని తెలుగులో తయారు చేయడం జరిగింది.

ఈ శాసనాలలో రాజు లేక రాణియొక్క వంశం, బిరుదులు, గుణగణాలు, చేసిన మంచి పనులు పేర్కొనేవారు. ఇలాటి శాసనాలను

తయారుచేసిన కవులను 'శాసన కవులు' అని పిలిచేవారు. ఈ శాసనాలు ఎక్కువగా దేవాలయాల్లో దొరికాయి. వీటిని చూచి, చదివి చరిత్రకారులు ఇలా అనేక విషయాలు మనకు తెలియ జెప్పారు. ముఖ్యంగా రాణి కాలంలో 'మార్కోపోలో' అను ఇటలీ యాత్రికుడు మన దేశంమీదుగా పోతూ, ఆంధ్రదేశమంతటా పర్యటించి కాకతీయుల పరిపాలనా సమర్థత గురించి, వారి రాజ్యంయొక్క మహదైశ్వర్యం గురించి, వారి సాహిత్య శిల్పకళలను శ్లాఘిస్తూ చరిత్రలో రాశాడు. కాకతీయుల స్వయం భూనాథాలయం ముందున్న చంద్రశిల ఆధారంగా గర్భగుడి ఎలా ఉండేదో చెప్పవచ్చు. ఆ చంద్రశిలను బట్టి గర్భగుడి పొడవు, వెడల్పు, ఎత్తు ఎలా ఉండేదో చెప్పవచ్చు. ఇదంతా కాకతీయుల శిల్పకళా చాతుర్యము, ప్రత్యేకత అనవచ్చును. దేవుడి గుళ్ళమీద రాతిలో విగ్రహాలు చెక్కించడానికి ఆ రోజుల్లో శ్రద్ధ చూపేవారు.

తెలుగుజాతికి రెండువేల సంవత్సరాల పైబడిన చరిత్ర ఉంది. అందులో కాకతీయుల పాలనలో, ముఖ్యంగా రాణి రుద్రమదేవి పరిపాలనలో తెలుగుజాతి అంతా ఐక్యంగా ఉంది.

ఇదంతా చరిత్రలో చదివి నేను మీకు కాకతీయుల చరిత్రను, రాణి రుద్రమదేవి కథను ఇన్నాళ్ళూ రోజూ కాస్త వినిపిస్తున్నాను'' అని మామ్మ వారికి విశదీకరించింది.

''అయితే మామ్మా, రాణి రుద్రమదేవి ఏమయినా గ్రంథాలు రాసిందా?'' ఆమె గ్రంథ రచని చేసివుంటే మరీ బాగుంటుందని రమ ఆలోచన.

''రుద్రమదేవి ఏ గ్రంథమూ రాసినట్లు మనకు ఆధారాలు లేవు. కాని ఆమెకు సాహిత్యంలో అభిలాష ఉన్నట్లు, ఆమె రాజధానిలో ప్రతి వారమూ ఒక 'విద్వత్సభ' (పండితుల సభ) జరుగుతున్నట్లు చారిత్రకాధారాలు దొరికాయి.

'విద్వత్సభ' అంటే అంతు పట్టని రవి "దాని అర్థం ఏమిటి మామ్మా?" అని అడిగాడు.

"అంటే బాగా చదువుకున్నవాళ్ళు ఏడు రోజులలో ఏదో ఒక రోజున కలసి వాళ్ళు రాసిన పుస్తకాల గురించి, అంతకుముందు పెద్దలు రచించిన గ్రంథాలను గురించి మాట్లాడుకునేవారు."

"అంటే చాలా గొప్పవాళ్ళన్న మాట. అలాంటి వారికి రాణి ఏమి సహాయం చేసేది? ఎలా చేసేది?" రవి ప్రశ్న ఇది.

"సాయం చేయటానికి ఆమె స్వయంగా పూనుకోనక్కరలేదు. ఒక్కొక్కప్పుడు ఆమె సామంతులు కవులను పోషించేవారు. ఒక విషయం మరచిపోవద్దు.

కాకతీయ సామ్రాజ్యం రాణి రుద్రమదేవి కాలంలోకూడ సామంత రాజులపై ఎక్కువగా ఆధారపడేది. వారు రాణి యెడల స్వామిభక్తితో నడుచుకునేవారు దేశరక్షణకు సాయపడేవారు దండయాత్రలలో ముందు ఉండేవారు. కప్పం కట్టేవారు. మిగతా విషయాలలో వారు స్వతంత్రంగా వ్యవహరించేవారు. అంటే కుంటలు, చెరువులు, కాసారాలు, సాగరాలు త్రవ్వించేవారు. దేవాలయాలు కట్టించేవారు. పాఠశాలలు నెలకొల్పేవారు. అడవులను కొట్టించివేసి, సేద్యపు భూమిని పెంచేది, కవులను పోషించేది; సాహిత్య, చిత్ర, వాస్తుకళలను ప్రోత్సహించేది అంతా సామంతులే కనుక వారు చేసిన ఘనత అంతా ఒకరకంగా రాణికే దక్కుతుంది" అంటూ సామంతుల పాత్రను తెలిపింది.

"ఇమ్మడి మల్లికార్జున నాయకుడు రాయించిన పానుగల్లు శాసనం అనంతసూరి అనే సంస్కృత కవి రచన. మల్యాల వంశం వారి ఆస్థాన విద్వాంసుడు ఈశ్వర భట్టోపాధ్యాయుడు. గోన బుద్ధారెడ్డి తెలుగులో రంగనాథ రామాయణం అనే ద్విపద కావ్యం వ్రాశాడు. జైనకవి అప్పయార్యుడు 'జినేంద్ర కళాభ్యుదయం' అనే గ్రంథం యొక్క కృతికర్త."

"అయితే మామ్మా! రాణి మనుమడు ప్రతాపరుద్రుని కాలంలో సంస్కృతం,తెలుగు రెండూ బాగా పెరిగాయి అంటారే, అది నిజమా?" ఇది రమ సందేహం.

"అవునమ్మా! ప్రతాపరుద్రుని కాలంలో విద్యానాథుడు అనే పండితుడు 'ప్రతాపరుద్ర యశోభూషణం' అనే అలంకార గ్రంథాన్ని వ్రాశాడు. గుండయభట్టు శ్రీహర్షుని ఖండకావ్యం మీద వ్యాఖ్య నిర్మించాడు. గజదళానికి నాయకుడైన జాయపసేనాని 'నృత్తరత్నావళి' అనే నాట్యశాస్త్రగ్రంథ రచన చేశాడు. పాల్కురికి సోమనాథుడు రుద్రభాష్యం వ్రాయటం జరిగింది. భాస్కర రామాయణం పేరు విన్నారా?"

"నాన్నగారు చదువుతుంటే విన్నాను" అన్నది రమ.

"భాస్కర రామాయణాన్ని ఒక కవి రాయలేదు. నలుగురు ఈ రచనలో పాల్గొన్నారు. హుళక్కి భాస్కరుడు కొంతరాసి, మిగతాది పూర్తిచేయడానికి తన కుమారుడు మల్లికార్జునభట్టుకు, శిష్యుడు కుమార రుద్రకవికి అవకాశమిచ్చాడు. అయినా కొంత భాగం కొరవడింది. అయ్యలార్యుడనే కవి మిగతాది పూర్తిచేశాడు. ప్రతాపరుద్రుని కోటకు పాలకుడైన నాగయ గన్ననికి అంకితమయిన గ్రంథం తిక్కన శిష్యుడు మారన తెలుగుచేసిన మార్కండేయ పురాణం. అనేక శతకాలు, నీతిశాస్త్ర గ్రంథాలు పుట్టాయి. పాల్కురికి సోమనాథుని బసవ పురాణం, పండితారాధ్య చరిత్రం పేరెన్నికగన్న పుస్తకాలు. ఈతడు ప్రతాపరుద్రుని కాలపు వాడని చారిత్రకులు, రుద్రదేవుని కాలపు వాడని తదితరులు వాదించడం జరుగుతున్నది, ఇలా ఎంతయినా చెప్పవచ్చును. ఇది అంతా ఎందుకు చెప్తున్నానో మీకు బోధపడిందా?" సూటిగా అడిగింది.

"నాకు అర్థం కావటం లేదు మామ్మా!" ఉన్నమాట నిర్మొహమాటంగా అనేశాడు రవి.

''ప్రతాపరుద్రుడు రాణి రుద్రమదేవి తరువాత రాజ్యానికి వచ్చాడు. ఒక్కసారిగా కళలు ఉప్పొంగవు; సాహిత్యం వికసించదు. రచన ఏ కాలంలో జరిగినా, ఎవరికాలంలో వెలువడినా దానికి పూర్వరంగం, ఉంటుంది. అంటే అంతకుముందునుంచే దానికి అనుకూలమయిన వాతావరణం, పరిసరాలు కావాలన్నమాట. అవి అన్నీ రుద్రమదేవి కాలంలో ఒనగూడాయి. అదీ ఆమె ఘనత, తెలిసిందా?''

''మామ్మా! రేపు వెయ్యి స్థంభాల గుడి, రామప్ప దేవాలయం, ఓరుగల్లు కోట తోరణాలు, స్వయం భూ ఆలయం - వీటిని గురించి చక్కగా చెప్పాలి సుమా!'' ఇంకా ఇంకా తెలుసుకోవాలనే ఆకక్తితో హెచ్చరించింది రమ.

ఇక ఆ రాత్రికి అందరూ విశ్రమించారు.

మామ్మ మళ్ళీ ఏడవ రోజు రాత్రి కథ మొదలుపెట్టింది:
'మామ్మా! కథ తెమలటం లేదేమిటి?'



"మా కాలంలో రామాయణం సప్తాహం చేసేవారు. అంటే ఏడు రోజులలో రామాయణం చదవటం పూర్తి కావాలి. మరి గొప్ప వాళ్ళ చరిత్రలు ఒక పట్టాన తెముల్తాయా?" తన అనుభవంతో వారికి నచ్చ చెప్పింది మామ్మ.

"మామా! ఈ రోజు పొద్దుటి నుంచి ఆలోచిస్తున్నాను - వరంగల్ వెళ్ళి చూడవలసినవన్నీ చూచి వచ్చి తరువాత నీ కథ వినడమా లేక నీ కథ ముందు విని తరువాత వరంగల్ వెళ్ళడమా అని!" సంశయాన్ని వెలిబుచ్చింది రమ.

"అది నీ ఇష్టం మనవరాలా ! ఏం తేల్చావు?" నిగ్గదీసింది మామ్మ.

"మామ్మా ! నేనే నీ కథ విన్నతర్వాత వరంగల్‌కూ, రామప్ప గుడికి తీసుకెళ్ళమని నాన్నను అడుగుదామని తేల్చుకున్నాను." తన నిర్ణయం తెలియజెప్పాడు రవి.

"మరి నీవో రమా?" సమాధానంకోసం రమ ముఖంలోకి చూస్తూ.

"నేనూ అంతేలే, కథ పూర్తిగా చెప్పు" అంది రమ.

"కాకతీయుల కాలంలో శిల్పకళ బాగా వృద్ధిచెందింది. వాస్తుశిల్పం అంటే కట్టడాలు కట్టే పనిలో నేర్పు ఆ రోజుల్లో బాగా అభివృద్ధి అయింది."

"నీవు కథ చెప్పే ముందు ఒక ప్రశ్నకు సమాధానం చెప్పి తీరాలి. అదేమంటే - వెయ్యి స్థంభాల గుడిని, స్వయం భూ దేవాలయాన్ని, రామప్ప దేవాలయాన్ని రాణి రుద్రమదేవి కట్టించిందా?" అడిగాడు రవి.

"కాకతీయ రాజులలో రుద్రదేవరాజు కూడ ముఖ్యుడే. అతడు రాణి రుద్రమదేవి తండ్రి అయిన గణపతిదేవుని పెదతండ్రి. అతడు క్రీ. శ. 1150 నుండి 1195 వరకు రాజ్యమేలాడు. ఈయన కవి కూడాను. 'నీతిసారం' అనే గ్రంథాన్ని రచించాడు. ఇతడే వెయ్యి స్థంభాల గుడిని కట్టించింది. ఇందు శివుడు, విష్ణువు, సూర్యుడు ప్రతిష్ఠింపబడ్డారు. ఈ దేవాలయంలోని నందీశ్వర విగ్రహం ఉక్కులాంటి నల్లరాతిలో చెక్కబడింది.

ప్రతి స్థంభం మీద జిలుగు నగిషీపని మనకు కన్పిస్తుంది ప్రతి స్తంభం ఒక అరటిచెట్టులాగుంటుంది.

రామప్ప దేవాలయంలో ఎర్రరాతిని వాడారు శిల్పులు. అచ్చం ఎరుపుకాదు. సూర్యోదయ సమయంలో ఆకాశంలో కన్పించే లేత ఎరుపు. ఈ శిల చాలా గట్టిది. అందువల్ల ఎలా చెక్కినా విరిగిపోలేదు. ఇప్పటికీ రామప్ప దేవాలయంలోని నర్తకీమణుల నృత్య భంగిమలు చూపరులను ఆకర్షిస్తాయి. వరంగల్లు కోటద్వార బంధాలు, స్వయం భూదేవాలయపు ద్వారతోరణాలు, శిల్పకళతో తొణికిసలాడుతూ మనందరికీ కన్నుల పండువు చేస్తాయి. నేను వీటిని పూర్తిగా వర్ణిస్తే మీరు అక్కడికి పోయి చూడరు - కనుక అంతగా వివరించను. మీరు వెళ్ళి చూస్తే పరమానంద భరితులు అవుతారు.''

రవిలో గుడికి వెళ్ళి తీరాలనే పట్టుదల పెరిగినట్లుంది. వెంటనే, ''రామప్ప గుడికి ఎలా వెళ్ళాలి?'' అడిగాడు.

''హనుమకొండ నుంచి బస్సులున్నాయి బాబూ! మామ్మ చెప్పింది.

మామ్మ ఇంకా ఇంకా చెప్పాలనే ఉత్సాహంతో వుంది.

''మామ్మా! చెరువుల సంగతి చెప్పలేదేం?'' గుర్తు చేసింది రమ.

''అవునమ్మా! మరచిపొయ్యాను. తెలంగాణా ప్రాంతం- అంటే పూర్వపు నైజాం రాజ్యంలో తెలుగు జిల్లాల నిండా పెద్ద పెద్ద చెరువులున్నాయి. నదులు దగ్గరలో లేకపోవటంతో పొలాలకు నీరు అందించే నిమిత్తం పెద్ద పెద్ద చెరువులు ఏర్పాటుచేశారు మహారాజులూ, వారి సామంతులూ. వారే కాదు, పెద్ద ఉద్యోగులూ, ధర్మబుద్ధికల అనేకమందీ ఆ పనికి పూనుకునేవారు. చెరువులు త్రవ్వించటం- ఏడు రకాల ధర్మ కార్యాల్లో ఒకటిగా హిందూ ధర్మం పేర్కొన్నది. మొదటి ప్రోలరాజు- ఈయన క్రీ. శ. 1030 నుండి, 1075 వరకు పరిపాలించాడు. ఈయన కేసరి సముద్రం అనే చెరువును తవ్వించాడు. రెండవ బేతరాజు- ఈయన క్రీ.శ. 1075 నుండి 1090 వరకు రాజ్యమేలాడు. 'సెట్టికెరె' అనే చెరువును ఏర్పరిచాడు.

గణపతిదేవుడు నెల్లూరు, ఏలూరు మున్నగు స్థలాల్లో చెరువులు నిర్మించాడు. పాకాల చెరువు గణపతి దేవుని కాలానికి పూర్వమే ఏర్పాటయింది. అది చాలా పెద్ద చెరువు. మాల్యాల వంశీయులు చెందసముద్రం, గణప సముద్రం, కుప్ప సముద్రం-మొదలైన చెరువులను త్రవ్వించారు. సబ్బ సముద్రం, నామ సముద్రం, ఎఱ్ఱ సముద్రం రేచర్ల వారి చేత నిర్మితము. ఈ రెండు వంశాలవారు కాకతీయ సామ్రాట్టులకు నమ్మిన మంత్రులు, సేనానులు. ఈ చెరువులనుండి పొలాలకు నీరు సరఫరా చేయడానికి పెద్దకాల్వలు త్రవ్వించారు అనేకమంది. మీరడగవచ్చు, 'వీటిలో దేనిని రుద్రమదేవి త్రవ్వించలేదు కదా,' అని. ఆ మాట నిజమే. వీటిని తగు మరమ్మత్తులతో ప్రజలకు ఉపయోగపడేటట్లు చేయటంలో ఆమె సమర్థత, శ్రద్ధ ఎల్లవేళలా ఉండేవి.''

''ఇంతకూ మామ్మా! నీవు 'రాణి చాలా గొప్పది' అని చెప్పావు. అయినా ఆమెకు పూర్వం వాళ్ళ వంశంలోనే రాజ్యంచేసిన రాణులు లేరా ఏమిటి?'' రవి ప్రశ్నించాడు.



"ఉన్నారు బాబూ! ఆమె ఎవరంటే మిరియాల కామసాని. ఈమె కాకతి స్థాపకుడయిన కాకర్త్య గుండన సోదరి. క్రీ.శ. 975వ సంవత్సరములో గుండన చనిపోయేనాటికి అతని కుమారుడు పొట్టిబేతడు- అంటే మొదటి బేతరాజుగా (994-1030) పేరు పొందినవాడు-పసివాడు. కనుక ఆ పిల్లవాని తరఫున మేనత్త మిరియాల కామసాని-ఆమె పుట్టింటి వారు పెట్టినపేరు కుంతలదేవి-సంరక్షకురాలిగా 19 సంవత్సరాలు కడు సమర్థతతో రాజ్యపాలన చేసి రాజ్యాన్ని రక్షించింది. కనుక ఆమె ఉదాహరణ రాణికి ముందున్నదనే విషయం గమనించాలి. వంశ చరిత్ర తరుచుగా పిల్లలకు గురు చేసాం కదా!"

"మామ్మా! రాణి భర్తను గురించి చెప్పలేదే?'' రమ అడిగింది స్త్రీ సహజమైన ఉత్కంఠతో.

''రాణి భర్త తూర్పు చాళుక్య వంశానికి చెందిన వీరభద్ర మహేశ్వరుడు. తూర్పు చాళుక్యను క్షత్రియులు వీరు కాకతీయులతో పెళ్ళికి ఇష్టపడలేదని, కాగా వీరభద్రుడు సంకోచం లేకుండా ఆమెను పెండ్లాడినాడని ఒక కథ వినపడుతూవుంది. ఈ వీరభద్రునివల్ల రుయ్యమాంబ అనే కూతురు రుద్రాంబకు కలిగినట్లు గట్టిగా ఆధారాలున్నాయి. కాగా పెనిమిటి అయిన వీరభద్రుడు ఆమె యెడల ద్వేష భావంతో సంచరించాడని కొందరు, అలాకాక అనురాగంతో ఆమెను చూచాడని మరి కొందరూ వాదిస్తూ కథలల్లారు. ఏదయినా నిడదవోలు కాపురస్తులయిన అతని వంశం వారు అతని మరణానంతరం - క్రీ. శ. 1266లో ఆయన చనిపోయాక - స్వతంత్రులయినట్లుగా వ్యవహరించారు. అత్తింటిపైఉన్న గౌరవం కొద్దీ రాణి వారిపై దండెత్తలేదు. ఇది రాణి ఔదార్యానికి, మంచి బుద్ధికి నిదర్శనం.''

"మామ్మా! 'రుద్రమదేవి' అనే పేరుతో కవిసమ్రాట్టు నోరి నరసింహశాస్త్రిగారు నవల రాశారని; అడవి బాపిరాజుగారు తమ 'గోన గన్నారెడ్డి' నవలలో ఆమె ప్రస్తావన తెచ్చారని; మహాకవి కాళ్ళకూరి నారాయణరావు 'ప్రతాపరుద్రమదేవి' అనే నవల రాశారని నాన్నగారు చెప్పారు. ఇంతమంది కవులు ఆమెను గురించి ఎందుకు రాశారు?''

"నీవు చెప్పిన వారే కాదమ్మా! మంచి పేరు ప్రఖ్యాతులున్న ఏటుకూరి నర్సయ్యగారనే మంచికవి పద్యాలతో ఆమెపై కావ్యం రాశాడమ్మా! ఒక్కొక్కరు ఆమెలో ఒక్కొక్క మంచి గుణం చూశారు. వైదిక మతశాఖ అయిన శైవాన్ని పోషించినందుకు ఒకరు పొగిడితే, తెలుగుతేజాన్ని దశదిశల చాటినందుకు మరొకరు గర్వపడ్డారు. ఇంకా నీ పెద్దయ్యాక ఈ పుస్తకాలను మీరు చదువుదురు గాని. రాయచూరు కోట నిర్మాణం చేసి ఎన్నో విజయాలను రాణికి సాధించి పెట్టిన గోన గన్నా రెడ్డి లాంటి యోధుని స్వామి భక్తిని పొందగల రాణి ఇంకా ఎంత

"అయితే రాణిలో గొప్ప నాయకత్వ లక్షణాలున్నాయి కదూ?"

"అవునర్రా! ఆమెలో ఒకటేమిటి,అనేక మంచి గుణాలు ఉన్నాయి. ధైర్యం, సాహసం, సమర్థత, పట్టుదల, నేర్పరితనం, ఔదార్యం, సహనం, ప్రజలయెడ అనురాగం, నిస్వార్థబుద్ధి – ఇలా ఎన్నో ఆమెలో రూపం ధరించాయి. తండ్రి వేయించిన రహదారులను బాగుచేయింటంలో రాణికి ఏమరుపాటు లేదు. బాటసారుల కొఱకు రోడ్ల ప్రక్క చెట్లు నాటించ టంలో శ్రద్ధ తీసుకున్నది. 1261 లో గణపతిదేవుడు నిర్మించిన గోళకి మఠమునిర్వహణార్థము 'మందర' గ్రామాన్ని రాణి తండ్రి అగ్రహారంగా ఇచ్చాడు. రాణి కాలములో దాని ఖర్చుల కొరకు 'వెలగపూడి' అను గ్రామము ఇచ్చినట్లు ఆధారాలు దొరికాయి. ఆ గోళకీ మఠములో రాణి విశ్వేశ్వరలింగ ప్రతిష్ఠ కావించింది. వెలగపూడి గ్రామ ఆదాయంలో నాలుగవ వంతు విద్యార్థులకు, మిగిలిన దానిలో ప్రసూతిశాల, ఆస్పత్రి కట్టించి నడుపుచుండేది. ఉచిత చికిత్సకై ఏర్పాట్లు చేయించేది. అన్న సత్రములలో వర్ణబేధము లేకుండా నాలుగు వర్ణముల వారికి ఉచిత భోజన శాలలు నడిపించేది. ఒక విద్యాపీఠము స్థాపించి అక్కడ నాలుగు వేదా లను అధ్యాపకుల ద్వారా, పదవాక్య సాహిత్యాన్ని, ఆగమ వ్యాఖ్యాలను పండితుల ద్వారా బోధింపచేసినట్లు చారిత్రకాధారాలు ఉన్నాయి. పాఠ శాలలో ఉపాధ్యాయులను, గ్రామాలలో కరణాలను నియమించి, వారికి వస్తువాహనాలు, ధాన్యము గ్రాసంగా ఇచ్చేది. వరంగల్లు కోట, దాని ద్వారబంధములందలి శిల్పములు, స్వయంభూదేవాలయ ద్వారములందలి

నెమ్మప్ప ప్రఖ్యాతి కన్నవి ఈనాటికీ చూడగలము. ఇలా ఎన్నో ఆమె కాలంలో మెరుగులు చెక్కబడ్డాయి.''

''మరి రాణి కులాలను తీసివేసిందా?'' కొంటె ప్రశ్న వేశాడు రవి.

"నిజమే. తీసివేయలేదు. పైగా వైదిక పండితుల మాటలు విన్నది. అయితే ఒక్క విషయం బాబూ! ఈ కాలపు ఆలోచనలతో ఆ కాలపు వారిని మదింపు వేయలేము. అప్పటి వారి పరిస్థితులు వేరు. అందరిలో అన్ని మంచి గుణాలు ఉండవు. ఆశించడం పొరపాటు అవుతుంది. ఏమైనా రాణి శత్రువులకు సింహస్వప్నమయింది. ఆనాడు రాణిని ఎదిరించగల సాహసం శత్రువులకు కొరవడింది. తానే సేనానాయకత్వం వహించి శత్రురాజులను భయకంపితులను చేస్తూ, ప్రజాహిత కార్యక్రమాలు నెరవేరుస్తూ గొప్ప ఖ్యాతి గడించిన ధీరురాలు. రాజ్యంలో శాంతి నెలకొల్పింది. కరువుకాటకాలనేవి లేకుండా రాజ్యాన్ని సుభిక్షంగా పరిపాలించిన ఘనత రాణికే చెల్లును మచ్చలేని జీవితాన్ని గడిపింది. ప్రజలను కన్నతల్లివలె 34 సంవత్సరాలు పరిపాలించి 1294లో పోయింది.

ఏమైనా ప్రసిద్ధ చరిత్రకారులు డాక్టరు నేలటూరి వెంకటరమణయ్య, మల్లంపల్లి సోమశేఖరశర్మగార్ల అభిప్రాయంతో ఆంధ్రదేశ పరిపాలకులలో ఆమె నిస్సందేహంగా మహాఘనత వహించిన వ్యక్తి. ఒప్పుకుంటారా? కాకతీయ శిల్ప సంపద వరంగల్ కోటలోను, రుద్రేశ్వాలయంలోను, రామప్ప గడులలోను నిలిచి వుండటం ఆంధ్రుల అదృష్టమని మీరు నమ్ముతారా? ఆడమనిషి కూడా పరిపాలనాది కీలక స్థానాలను సమర్థవంతంగా నిర్వహించగలదని, నిర్వహించిందని గౌరవిస్తారా?" మామ్మ అన్నది.

''తప్పకుండాను.'' 'రాణి రుద్రమ దేవికి జై', 'రాణి రుద్రమ దేవికి జోహార్!' సంతృప్తిగా నినాదాలిచ్చారు పిల్లలిద్దరూ.